JYOTI MAY 67 Regd. No. H. 368

యస్.వి.ఆర్. ఫిలిమ్స

# చదరంగం

దర్శకత్వం యస్.వి.రంగారావు

నిర్మాత: బడేటి సత్యనారాయణ
నిర్వహణ: పుట్టా వెంకట్రావు
పూర్ణా రిలీజ్



కిలు జీవితాంతం
పయోగపడుతుంది
ర్క్యులిస్ మీ సొత్తుకు
ంచి విలువైనది

ష్టమైన రకము, మితమైన
తో హెర్క్యులిస్ బైసికిళ్ళలో
గ్యమైనది ఎంతమాత్రము
ర్యము లేదు. ప్రపంచమంతటా
దేశాలలో ఎక్కువగా
రూ వాడేదే ఇది
ఈస్ట్ ఏషియాలో మద్రాసు
ు మంచి సాధన సదుపాయాలు
న పెద్ద సైకిల్ ఫ్యాక్టరీలో
జాతీయపు అర్హతలకు
గుణ్యంగా
యారుచేయబడింది
ర్క్యులిస్ ప్రపంచంలో పెద్ద
సైకిళ్ళ ఉత్పత్తిదారులైన ట్యూబ్
ఇన్వెస్ట్‌మెంట్స్ లిమిటెడ్,
యు కె వారి సౌజన్యంతో
ఖచ్చితముగా నిర్మింపబడినది

® హెర్క్యులిస్ -

ఒక్క సైకిలే
కాదు జీవితకాలపు నేస్తము








**ఇప్పుడు హెర్క్యులిస్ కొన్నాడు**

"హెర్క్యులిస్ కొనడానికి కష్టపడి కూడ బెట్టాను ఆ 'హ' ఎంత మంచి పెట్టుబడి! ఎప్పుడూ ఇంట్లో నమ్మకమైన భాగస్వామి.



వెల విశిష్టత బలిష్టత మన్నిక అందము-అన్నిటి లోను హెర్క్యులిస్ సొమ్ముకు మంచి విలువైనది-

® ది హెర్క్యులిస్ సైకిల్ మరియు మోటర్ కంపెనీ లిమిటెడ్ యు కె వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కులు ఇండియాలో తయారీ టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా అంబత్తూరు మద్రాసు-53 ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ మద్రాసు 1 ఉపయోగించుటకు రిజిస్టరు కావింపబడిరి. చిన్న మొత్తముల శేకరణలో ఆదా చేయండి

TIC/H/3822 A

జ్యోతి

★

# తొలిమాట

ఈసారి 'జ్యోతి' కి అందమైన అలంకారాలుగా నలుగురు ప్రముఖుల నాణ్యమైన కథలు.

కీడెంచి మేలెంచమన్నారు కీడెంచి మేలెంచక పోవడంలోగల పదుపాయాన్ని వివరించే ప్రత్యేక రచన (71 పేజీ)

1883 లో జరిగిన ఒక ప్రపంచాద్భుత సంఘటనపై ఆసక్తికరమైన వ్యాసం (105 పేజీ)

కథలు ఎలా రాయాలని ఎవరో అడిగితే "ఏముందీ"? క్లైమాక్సుతో మొదలుపెట్టి చివరికంటా రాసుకు పొమ్మన్న కథకచక్రవర్తి ఓ హెన్రీ పై ప్రత్యేక వ్యాసం (56 పేజీ)

మన నూతన్న రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి గురించి జ్యోతీకరించిన రాజకీయ శీర్షిక (10 పేజీ)

వేమూరు రాధాకృష్ణ

★



**సచిత్ర మాసపత్రిక**

బకింగ్‌హామ్ పేట పోస్టు

విజయవాడ-2

విడిప్రతి వెల

**80 పైసలు**

పేడాది చందా

**9-50 రూపాయలు**

**సంపుటి 5**

**జూన్ 1967**

**సంచిక 6**

మేనేజింగ్ ఎడిటర్

**వి. వి. రాఘవయ్య**



ముఖచిత్రం:

శేఖర్ [illegible],

"గొల్లభామ" లోని దృశ్యాలు



మే నెల 'జ్యోతి' లో మీరు ప్రచురించిన లింకన్ – కెనెడీ చిత్రమైన పోలికలు నన్నెంతో ఆకర్షించినవి. ఇన్ని చక్కటి పోలికలు, ఎంతో విశదంగా ప్రచురించిన మీకు నా అభివందనములు. ఈ నెల – కథలలో 'జారి గుండె', 'అందమైన పొరుగు' బాగున్నాయి. రచయిత్రులైన శ్రీమతులు అచంట శారదాదేవి – కె. రామలక్ష్మి గార్లకు నా అభినందనలు. 'ప్రముఖుల హాస్యాలు' బాగున్నాయి. 'పొట్టి కథలు' పొట్టి – దిట్టమైన నవ్వు పుట్టిస్తున్నాయి. చక్కని – చిక్కని కథలు – వివిధ రకాలైన శీర్షికలు మా కందిస్తున్న మిమ్మల్ని ఇంకొక సారి అభినందించకుండా ఉండలేను.

డి. వి. గోపాలకృష్ణ,
చిత్రకొండ (ఒరిస్సా).

మీ పత్రికలో ప్రచురించిన శ్రీ జి. నరసింహారావుగారు రచించిన 'ప్రేమ–ద్వేషం' అత్యద్భుతంగా వుంది కథ చిన్నదిగా వున్నా రస వత్తరంగా వున్నది రచయితకు నా హృదయ పూర్వక అభివందనములు

జె. కృష్ణప్రసాద్, తణుకు.

మే నెల సంచిక జ్యోతిలో రెండవ బహుమతి పొందిన కథలు రెండూ బాగున్నాయి

సి ఆనందారామంగారి కొత్త సీరియల్ కొత్త రకంగా బాగుంది

ఈ సంచికలోని 'సివిల్ ఇంజనీర్ ప్రేమగీతం' కూడా బాగుంది

మీ జ్యోతి పత్రిక గురించి మాస్కో, న్యూయార్క్ల నుండి వచ్చిన పాఠక సోదరుల లేఖలు మా కెంతో ఆనందోత్సాహాలు కల్గించాయి

అందరి అభిమానాలను చూరగొని 'జ్యోతి' ఇంకా బాగా వృద్ధిలోకి వస్తుందనుటలో సందేహం లేదు

కుమారి ఎన్. సుగుణ,
సీతారాంపురం మైన్స్,
గుంటూరు జిల్లా.

# బాధే ఆనందం

రవి ఉదయిస్తాడు, అస్తమిస్తాడు ప్రతిరోజూ. ఆశలు రేకెత్తుతాయి, అణగారి పోతుంటాయి ప్రతివ్యక్తికి వెలుగు చీకట్లువలె ఆశ నిరాశలు విడువకుండా వెంటాడుతుంటాయి. అంతేనా జీవితం అని అనిపిస్తూంటుంది. కాదు ఉదయాస్తమయాలమధ్య వెలుగు, ఆశ నిరాశలతో కూడా జీవితంలో వుంటూనే వుంటాయి మహోన్నత శిఖరాలలో జనించిన నదులు సాగరంలో కలవక తప్పకపోయినా, దారిలో ఎన్నో ఎడారులను సస్యశ్యామలం చేస్తుంటాయి. ఎందరికో దప్పిక తీరుస్తుంటాయి. సుందరమైన చెట్లను పెంచుతుంటాయి. అట్లాగే ప్రతివ్యక్తి జీవితం కూడా ఎంతో కొంత మంచిచేస్తే ఎంత ఆనందముగా మారుతుంది ?

ఈలాంటి ఆలోచనలు మీ అందరికీలాగే నాకూ వస్తూండేవి . ఆరుబయట వెన్నెల్లో కూర్చున్నా, మా వూరిప్రక్క కొండ ఎక్కి చూస్తున్నా, నది ఒడ్డున ఒంటరిగా నడుస్తున్నా, దిగజారుతున్న ఆర్ధిక పరిస్థితి, క్రుంగదీస్తున్న కుటుంబపు చీకాకులు అవసరమొస్తే ఆదుకోలేని మిత్రులు, ఈ పరిస్థితులలో ఏదైనా ఎలా చేయటం ? మనకు సాధ్యమా ? అని సంశయాలు భూతాలవలె వెంటాడుతున్నా, గంపెడాశతో గుంటూరు బయలుదేరా. ఎప్పుడో చదువుకున్న పరిచయాలు ఎట్లా ఈ నగరంలో ఏమీ లేకుండా జీవించటం అని భయమేసేది. ఏ పనిలో నాకు సామర్ధ్యమున్నదని రుజువు చేసుకోవటం ? కాళ్ళు వాచేలా తిరగ్గా ఒక చోట గది అద్దెకు దొరికింది చేతిలోని పది రూపాయలు [illegible] ఇక తరువాత తిండి ? రెండు మూడు రోజులు గడిచాయి. మిత్రులు [illegible] పిస్తున్నారేగాని, అన్నం తిన్నావా ? [illegible] ? అన్నవాళ్ళే లేరు అప్పుడిగితే తీర్చటం ఎట్లా? ఇలా మూడు రోజు[illegible] వుపవాసా[illegible] గడిచినాయి తిరిగి ఇంటికి వెడదాం అనిపించదు. కాని, తిరిగిపోతే వూళ్ళో, వాళ్ళు ఏమంటారు. ఇలా అనుకుంటూ, గుండెచిక్క బట్టుకుని, దగ్గరలో క్రొత్తగా పెట్టిన కాఫీహోటల్ యజమానిని ఒక్క రూపాయి వరకు అప్పు పెట్టమని అడిగితే ఎగాదిగాచూసి సరేనన్నాడు అన్న [illegible] రోజుల వరకు [illegible] గ్యారంటీగా అరకప్పు కాఫీ దొరుకుతుందని నమ్మక[illegible] దొరికింది ఆనందముగా ఒక అరకప్పు తెప్పించుకొని త్రాగుతుండగా ఎదురుగా కూర్చున్నాయన ఎగాదిగాచూస్తున్నాడు "మీరేం చేస్తున్నారు" అని అడిగాడు "ఏమి లేద" న్నాను ఏం చదువుకున్నారంటే "[illegible]" అన్నాను "పాపం" అన్నాడు కాని నా బిల్లు నేను యిచ్చుకున్నాను రెండు పైసలు వేళ్లు చెప్పకూడదూ అన్నాడు "నాకది యిష్టమేగాని పిలలేరీ ?

విజయసాంబుగారి "సివిల్ ఇంజనీర్ ప్రేమగీతం"—చాల బావుంది ఉన్నవ విజయలక్ష్మిగారి సీరియల్ "కిశోరప్రాయం" ఇంట్రెస్టింగ్ గా వుంది. కె. రామలక్ష్మిగారి "అందమైన పొరుగు" సరదాగా . వుంది. ఇటువంటి రచనలందిస్తూ 'జ్యోతి'కి శోభ చేకూర్చే రచయిత, రచయిత్రులకు నా మనఃపూర్వక అభివందనలు.

ఇంకా మంచి, మంచి కథలందించి పాఠకులకు సంతోషము కల్గిస్తారని ఆశిస్తూ ...

పి. ప్రభాకర్,
అనకాపల్లి.

మే నెల "జ్యోతి"లో ప్రచురించిన పోటీకథల, కారణం, పరిశీలనాశక్తి ఎవరికష్టం వారిది, తప్పిపోయిన, నష్టం, నెలకు తగిన తప్పు, మొదలగు పోటీకథలు చాల బాగున్నవి. ఇలాగే పోటీకథలు ఎక్కువగా ప్రచురిస్తారని ఆశించు చున్నాను. మే నెల "జ్యోతి"లో ప్రారంభించిన కొత్త సీరియల్ చాల బాగున్నది. ఎక్కువగా ఛలోక్తులు మమ్మల్ని ఆకర్షించినవి. జూన్ జ్యోతి గురించి ఎప్పుడు ఫస్టు వస్తుందా అని ఎదురు చూస్తున్నాం.

షాబ్జి. కృష్ణవేణి,
రాజమండ్రి.

---

అన్నా. ముందు మా ప డితో ప్రారంభించండి. వాడుట్టి ఒడుద్దాయి" అన్నాడు. చేతనైనంతవరకు చేస్తాను అని ప్రారంభించాను 1957 లో. ఆ సంవత్సరంలో 10 మంది. ఆ నాటినుండి శక్తివంచన లేకుండా, మన అలసత్వంవల్ల విద్యార్థులకు ఏం లోపం వస్తుందో ననే భయంతో నేటికి అలాగే శాయశక్తుల కృషిచేస్తున్నాను. విద్యార్థులు చెల్లించే దాంట్లో వారి సౌకర్యాలు ముఖ్యంగా చూస్తూ వారికే లోపం రాకుండా చూస్తుని యున్నాను. అందువలననే రెండు పెద్ద లేబొరేటరీలు, పెద్ద లైబ్రరీ, ఫిలిం ప్రొజెక్టరు మొదలైన సామాగ్రి సుమారు ఒక లక్ష రూపాయల విలువగలవి ఏర్పాటు చేశా. మంచి జీతాలిచ్చి మంచి అధ్యాపకులను నియమిస్తూ, వసతికి హాస్టల్స్, క్రమశిక్షణకు భంగం లేకుండా, బాలబాలికలకు ఇంగ్లీషు – తెలుగు మీడియంలకు వేర్వేరు కళాశాలలు ఏర్పాటు చేశా. అందుకే ఈనాడు మూడు కాలేజీలలోను 1500 మంది సకల సౌకర్యాలతోను. చదువుకోగల్గుతున్నారు. మీరందరూ చూపుతున్న ఆదరణకు ఎలా ఋణం తీర్చుకోవాలో ఎప్పుడూ ఆలోచిస్తున్నాను ఎంత బాధపడి దీన్ని నిర్మించానో అంత ఆనందం ఈ రోజు కలుగుతుంది మీ సహకారం సదా కోరుతున్నాను

సి. వి. ధన్, ఎం ఎ, ప్రిన్సిపాల్
రవి ట్యుటోరియల్ కాలేజి, బ్రాడీపేట, గుంటూరు-2.




డాక్టర్ జాకిర్ హుస్సేన్ ఆ రోజులలో ఢిల్లీలోని జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గా వుండేవారు పరిశుభ్రత కోసం ఆయన ఎంతో శ్రద్ధ తీసుకునేవారు యూనివర్సిటీలోని చిన్న, పెద్ద భవనాలన్నీ ఎంతో శుభ్రంగా అద్దంలాగ నిర్మలంగా వుండేవి మురికిని ఆయన సహించేవారు కాదు

ఒకసారి యూనివర్సిటీ ఆవరణలో తిరుగుతుండగా మాసిపోయిన టోపీ ధరించిన ఒక హైస్కూలు విద్యార్థి డాక్టర్ జాకిర్ హుస్సేన్ కంటపడ్డాడు వెంటనే వాడిని తన ఇంటికి తీసుకుపోయి, టోపీ తెల్లగా ఉతికి, ఇస్త్రీచేసి, వాడి తలపై పెట్టి పంపించారు ఆ విద్యార్థి మళ్ళీ జన్మలో ఎప్పుడూ మురికిబట్టలు తొడగలేదు

ఇంకొకసారి యూనివర్సిటీ వంటశాలలో కిటికీల అద్దాలకు మురికి పట్టివుంది వాటిని శుభ్రం చేయాలని డాక్టర్ హుస్సేన్ ఆదేశించారు ఆయన వర్నాడు వచ్చి చూస్తే ఇంకా ఆ అద్దాలు అలాగే వున్నాయట అయనకు ఎప్పుడు రానంత విపరీతంగా కోపం వచ్చేసింది పిడికిలి బిగించి మురికిపట్టిన అద్దాలన్నిటిని వరసగా బద్దలు కొట్టారు ఆ తరవాత పరిశుభ్రత విషయంలో అక్కడివారు ఎప్పుడూ అశ్రద్ధ చేయలేదట

ఇండియాకు మూడవ రాష్ట్రపతి అయిన డాక్టర్ జాకిర్ హుస్సేన్ పరిశుభ్రతపై తనకున్నంత శ్రద్ధాసక్తులను ఇతర నాయకులకు కూడా కలిగించగలిగితే, ఢిల్లీ నగరమే కాదు, దేశంలోని మిగిలిన నగరాలు కూడా అచిరకాలంలో బాగుపడతాయి

ఆయన వైస్ ఛాన్సలర్‌గా పని చేసిన జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయం—దీని అసలు పేరు జామియా మిలియా ఇస్లామియా — డాక్టర్ జాకిర్ హుస్సేన్ స్వయంగా

## వ్యక్తులు * వార్తలు * వ్యాఖ్యలు

స్థాపించినదే. ఆయన వంశీకులు పఠాన్లు. ఉత్తర ప్రదేశ్‌కు చెందిన వారైనా ఆయన తండ్రి హైదరాబాదు వచ్చి స్థిరపడి లాయరు వృత్తిలో వుండేవారు. హైదరాబాదులోనే 1897 లో జాకిర్ హుస్సేన్ జన్మించారు. ఇటావాలో, అలీఘర్‌లో విద్యాభ్యాసం చేశారు.

ఆయన అలీఘర్ ముస్లిం యూనివర్సిటీలో చదువుకుంటున్న రోజులలోనే 1920 లో గాంధీగారి సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమైంది. దానిలో జాకిర్ హుస్సేన్ చేరారు. 1920 అక్టోబరు 29 వ తేదీన మరికొందరితో కలిసి ఆయన అలీఘర్ యూనివర్సిటీలో చదువుకు స్వస్తిచెప్పి 'జామియా మిలియా ఇస్లామియా' స్థాపించారు. అప్పుడాయన ఎం. ఎ. చదువు మధ్యలో ఆగిపోయింది. తర్వాత బెర్లిన్ వెళ్ళి ఎకనామిక్సులో పి హెచ్. డి. డిగ్రీ సంపాదించి తిరిగి వచ్చారు. అది 1926 వ సంవత్సరం. నాటినుంచి 1947 వరకు తన యూనివర్సిటీకి తానే వైస్ ఛాన్సలర్‌గా పనిచేశారు.



1947 లో దేశం స్వతంత్రమైన తర్వాత ప్రధాని నెహ్రూ, మౌలానా ఆజాద్‌ల బలవంతంపై తన యూనివర్సిటీని వదలి అలీఘర్ ముస్లిం యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ పదవిని స్వీకరించారు.

1952 లో ఆయన లోక్‌సభకు కాంగ్రెసు టిక్కెట్టుపై నిలబడవలసిందే గాని, ఉత్తర ప్రదేశ్ ఓటర్ల జాబితాలో ఆయన పేరు లేదట. దానితో ఆయనను ప్రభుత్వం రాజ్యసభకు నామినేట్ చేసింది. 1957 లో బీహారు గవర్నరుగా నియమితులయ్యారు. 1962 లో ఉపరాష్ట్రపతిగా ఎన్నికయ్యారు. 1963 లో ప్రభుత్వం ఆయనను "భారతరత్న" బిరుదుతో సన్మానించింది.

జీవితంలో డాక్టర్ హుస్సేన్‌కు అన్నిటికంటె ఆసక్తి కలిగించేవి విద్యా విషయాలు. ఆ రంగంలో ఆయన చాలా కృషి చేశారు. అందుకే గాంధీజీ తన బేసిక్ విద్యా పథకాన్ని డాక్టర్ హుస్సేన్‌కు

ఆప్యాయించాయి. డాక్టర్ హుస్సేన్ తరుచుగా వర్ధా, సబర్మతీ ఆశ్రమాలకు వెళ్ళి గాంధీజీతో విద్యాసమస్యలను గురించి ముచ్చటిస్తుండేవారు. ఆయన విద్యాసక్తి, దేశభక్తి, నిజాయితీ గాంధీజీని చాలా ఆకర్షించాయి.

ఈనాడు రాష్ట్రపతిగా బ్రహ్మాండమైన భవనంలో నివసిస్తున్నా, ఒకనాడు ఆయన దారిద్ర్యాన్ని యోగసాధనవలె అనుభవించేవారు; నెలకు 75 రూపాయల కంటె ఒక్క పైస అదనంగా ముట్టకుండా, అర్ధాకలితో వుంటూ, తన బట్టలు తానే ఉతుక్కుంటూ నిరాడంబరతనూ అలవరచుకున్నారు.

మే 6 వ తేదీన రాష్ట్రపతి పదవికి జరిగిన ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థిగా డాక్టర్ జాకీర్ హుస్సేన్ ప్రతి పక్షాల అభ్యర్థి శ్రీ కోకా సుబ్బారావు పై లక్షకు పైగా మెజారిటీతో గెలిచారు. ఆయన ఓడిపోయి వుంటే, ముస్లిం కనుక హిందూ ఇండియాకు ఆయన గిట్టలేదని పాకిస్తాన్ వంటి దేశాలు ప్రచారం చేసేవి. ఆయన విజయం మన మత ప్రమేయ రహితమైన రాజ్యాంగానికే విజయం.

## ఉపరాష్ట్రపతి

రాష్ట్రపతి డాక్టర్ జాకిర్ హుస్సేన్ వలెనే పరిశుభ్రత అంటే అమిత శ్రద్ధ కలిగిన శ్రీ వి. వి. గిరి ఉపరాష్ట్రపతిగా ఎన్నిక కావడం ఒక విశేషమే. ఆయన మైసూరు గవర్నరుగా బెంగుళూరులో వుండగా పారిశుద్ధ్యంపట్ల ప్రజలకు ఆసక్తి కలిగించడానికిగాను వారానికొకరోజున పని కట్టుకుని, చీపురు పట్టుకుని పురవీథులను పరిశుభ్రం చేసేవారు. ఉపరాష్ట్రపతి కాగానే ఆయన చేసిన మొదటి ప్రకటనలలో ఒకటి 'ఢిల్లీని సుందరతర నగరంగా చేస్తా' నని.

ఇంతవరకే ఆయనకు డాక్టర్ హుస్సేన్‌తో పోలిక. డాక్టర్ హుస్సేన్ మొదటి నుంచి రాజకీయాలకు ఒక పెడగా వుంటూ వచ్చారు శ్రీ వరాహగిరి వెంకటగిరి విద్యార్థి దశలోనే రాజకీయాలలో ప్రవేశించారు. రాజకీయాలలో కూడా ఆయనది మరీ వివాదాస్పదమైన కార్మిక శాఖ.

ఆనాడు మద్రాసు రాష్ట్రానికి చెందిన గంజాం జిల్లా బరంపురంలో 1894 ఆగస్టు 10వ తేదీన జోగయ్య పంతులుగారి కుమారుడుగా జన్మించిన శ్రీ వి. వి. గిరి కళ్ళికోట కాలేజిలో విద్యాభ్యాసం పూర్తిచేసుకుని ఐర్లెండులో బారిస్టర్ చదువుకు వెళ్ళారు. ఆనాటి ఐరిష్ జాతీయనాయకులు, మేధావులు అయిన డీవేలరా, కాలిన్, పియర్స్, డెస్మాండ్ ఫిట్జ్‌రాల్డ్, స్విఫ్ట్ మెక్నీల్, జనరల్ కానొలీ, జింలార్కిన్ మొదలైన వారితో ఆయనకు పరిచయం కలిగింది. ఆయన రాజకీయ చర్యలకు కినిసి బ్రిటిష్ ప్రభుత్వం శ్రీ గిరిని ఇండియాకు బహిష్కరించింది. బారిస్టర్ పట్టా పుచ్చుకోకుండానే ఇండియా తిరిగివచ్చి కాంగ్రెసులో,

హోంరూల్ లీగ్‌లో, గాంధీజీ సత్యాగ్రహోద్యమంలో చేరారు.

1922 నుంచి ఆయన ఆసక్తి కార్మికోద్యమంవైపు మరలింది. ఆ ఉద్యమ నిర్మాతలలో శ్రీ గిరి ఒకరు. ఆలిండియా రైల్వే మెన్స్ ఫెడరేషన్ స్థాపకుడు ఆయ . 1926లో ఒకసారి, 1942లో రెండవ సారి ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. 1931 లో రెండవ రౌండ్ టేబుల్ సమావేశానికి కార్మిక ప్రతినిధిగా శ్రీ గిరి గాంధీజీతో పాటు హాజరయ్యారు.



1934 నుంచి 1937 వరకు గంజాం-విశాఖ నియోజక వర్గ ప్రతినిధిగా కేంద్ర లెజిస్లేటివ్ అసెంబ్లీలో సభ్యుడు. ఆరోజులలో ఆయన సహచరులు సత్యమూర్తి, భూలాభాయ్ దేశాయి, జిన్నా, పంత్, మాలవీయ, అసఫాలీ ప్రభృతులు.

1937 లో మద్రాసులో ఏర్పడిన రాజాజీ మంత్రివర్గంలో శ్రీ ప్రకాశంతోపాటు శ్రీ గిరి కూడా సభ్యుడు. ఆయనది కార్మిక, పరిశ్రమల, సహకార, వాణిజ్యశాఖ. 1947 లో ప్రకాశం మంత్రివర్గంలో కూడా అదేశాఖ. 1947 నుంచి 51 వరకు సింహళంలో మన మొదటి హైకమిషనర్‌గా పనిచేశారు. 1952 లో నెహ్రూ క్యాబినెట్‌లో మళ్ళీ కార్మికశాఖ. 1957 నుంచి 1960 వరకు యు. పి. గవర్నర్. తర్వాత కేరళ గవర్నరు. 1965 ఏప్రిల్ నుంచి మైసూరు గవర్నరు.

పదిమంది ఔనన్నదాన్ని కాదనడానికి ఎప్పుడూ జంకని నిర్భీకుడు శ్రీ గిరి. తరుచుగా వివాదాస్పద ప్రకటనలు చేస్తుంటారు. ఈ మధ్య అటువంటి ప్రకటనే ఒకటి చేశారు. భాషా రాష్ట్రాలుగా దేశాన్ని విభజించడం వల్లనే కొన్నికొన్ని అనర్థాలు వాటిల్లుతున్నాయని ఆయన వాదం. వాటిని రద్దుచేసి - తూర్పు, పశ్చిమ, ఉత్తర, దక్షిణ, మధ్య-జోనల్ రాష్ట్రాలను అయిదింటిని మాత్రమే ఏర్పాటు చేసి, నెమ్మ

దిగా ఒక పద్ధేళ్ళలో ఫెడరల్ వ్యవస్థ స్థానంలో యూనిటరీ రాజ్యాంగాన్ని ఏర్పాటు చేయాలని ఆయన సూచన.

భాషా రాష్ట్రవాదాన్ని తీసుకు వచ్చిందే ఆంధ్రులు. తాను ఆంధ్రు డైనా, ఇటువంటి ప్రకటన చేయడం శ్రీ గిరిగారి నిర్మొగమాటానికి నిదర్శనం. అయితే ఆయన తన భారీ విగ్రహానికి తగిన చక్కని 'సెన్స్ ఆఫ్ హ్యూమర్' కలిగిన వ్యక్తి. యూనిటరీ రాజ్యాంగంపై ఆయన సూచన కూడా ఒక ఛలోక్తి కావచ్చు.

73 ఏళ్ళ వృద్ధాప్యంలో రాజ్య సభ ఛైర్మన్‌గా రోజూ సభా కార్య క్రమాలకు హాజరై అటు కాంగ్రెసును, ఇటు ప్రతిపక్షాలను శ్రీ గిరి ఎలా సంబాళించుకు వస్తారో చూడాలి.

## మాజీ రాష్ట్రపతి

డాక్టర రాధాకృష్ణన్ ప్రొఫెసర్‌గా వుండే రోజులలో ఆటోగ్రాపు కావాలని అడగవచ్చిన వారికి మూడు సందేశాలు వ్రాసి, సంతకం పెట్టి ఇచ్చేవారట: 'వర్క్, మోర్ వర్క్, ఎండ్ మోర్ వర్క్' (పని చెయ్యి, ఇంకా పని చెయ్యి ఇంకా ఎక్కువ పని చెయ్యి.)



ఆయన తన జీవిత మంతా ఈ మూడు సందేశాలను పాటించి చూపించారు. 79 సంవత్సరాల తమ జీవితంలో విద్యా విజ్ఞానాల వ్యాప్తి కోసం, రాజకీయాలలో పరిశుద్ధత కోసం ఆయన అనవరత కృషి చేశారు. మే 13వ తేదీన పదవీ విరమణచేసి మద్రాసు మైలాపూర్ లోని స్వగృహం (గిరిజ) లో వ్యాపక బాహుళ్యం నుంచి ఇప్పుడు విశ్రాంతి తీసుకుంటున్నారు. పుస్తకాలు వ్రాస్తూ, చదువుతూ ఈ విశ్రాంతిని వినియోగిస్తారని ఆశించ వచ్చు.

రాజకీయాలలో శ్రీ రాధాకృష్ణన్ తామరాకుపై నీటిబొట్టు వలె వుండేవారు. ఆయన ప్రధానంగా విద్యావేత్త. ఉపాధ్యాయ వృత్తినుంచి వచ్చినవారు కావడం వల్ల, ఆయన ప్రసంగాలు ప్రజలకు బోధిస్తున్న ధోరణిలో వుండేవి.

తమ ఇటీవలి ప్రసంగాలలో రాజకీయాలను జీవనోపాధిగా పెట్టుకున్న నాయకమ్మన్యులను తరుచుగా మందలించేవారు. ఆయనకు కిడ్నోలిస్తూ ప్లేటో పేర్కొన్న తాత్విక-రాజకీయ వేతలతో ఆయనను పోల్చిన పార్టీ పొలిటీషియన్లలో ఎందరికి ఆ మందలింపు చెవికెక్కి వుంటుంది? ***

---

# పరిహారము

ద్వివేదుల విశాలాక్షి

పదవ నెంబరు బస్సు రొద చేస్తూ కొంటూ తొమ్మిదన్నరకల్లా వచ్చి ఆ స్టాపులో ఆగుతుంది. నేను తొమ్మిదింబావుకల్లా ఇంటిదగ్గర బయలు దేరుతాను. రిస్టు వాచిలో సెకండ్ల ముల్లు చూసుకొంటూ అడుగులు వేస్తూ ఆ రోడ్డు కొలుస్తాను. భగవంతుడి దయవల్ల మా వీధిలో కారుల, బస్సుల రద్దీ ఉండదు. లేకపోతే నేను ఏ కారు క్రిందనో పడి ఏనాడో చచ్చిపోయి ఉంటాను.

కిల్లీ దుకాణం దగ్గరికి చేరేసరికి తొమ్మిదీ ఇరవై రెండు. వాడు కట్టి ఇచ్చిన కిల్లీ నా నోటిలోకి చేరేసరికి మరి మూడు నిమిషాలు పడుతుంది. అప్పటికి నాలో చురుకుపాలు అందుకొంటుంది. ఆఖరిసారిగా రిస్టు వాచి ముళ్ళని చూసిన కళ్ళు ఇంక వేగం హెచ్చిస్తే కాని లాభం లేదని కాళ్ళకి బుద్ధి చెప్తాయి. ముందున్నది మెయిన్ రోడ్డు జాగ్రత్త అని కళ్ళని హెచ్చరిస్తుంది మనసు.

ఒక్కొక్క బస్సుని అందుకొనేందుకు నేను పరుగు తీస్తాను. ఇంకో రోజు బస్సే నన్ను అందుకోవాలన్నట్లు పరుగుతో వస్తుంది ఆ రోజు ఇద్దరం ఓడిపోయేము. నా ఓటమికి కారణాలు చెప్పబోతే మా శ్రీమతి నా మీద విరుచుకు పడుతుంది. బస్సు ఓటమికి కారణం చెప్పవలసిన వాడు బస్సు కండక్టరు.

పది గంటల వరకు బస్సు రాలేదు. తాపీగా పరిసరాలని తిలకిస్తూ క్యూలో నిలబడ్డాను. ఎదురుగా పేవ్‌మెంట్ మీద ముష్టివాడు — "అయ్యా...

బాబూ ... అమ్మా ధర్మం చేయండి తల్లీ. ఈ కుంటివాడికి ఒక పైసా దానం చేయండి బాబూ."

వాడి అరుపులు బస్సు కదులు తుంటే రోజూ చెవుల్లో పడతాయి. కాని సావకాశంగా ఆ మానవాకృతిని చూసే వీలు ఆ రోజు నే కలిగింది. ఒక చింకి గోనె పట్టి మీద ఒక కాలు ముందుకి జాచి కూర్చున్నాడు. కుడికాలు తొడకిందు తుండెలా, కుర్రాడు తిని పారవేసిన మొక్కజొన్న కండెలా ఉంది. కుడి ప్రక్కన ఊతకర్ర, ఎడమ ప్రక్కన చిల్లులు పడిన ఎనామిల్ డొక్కు, దాని సరసనే వాలికలుగా ఉన్న చింకిలాల్చీ—ఇదీ వాడి సంసారం.

వాడిని చూస్తుంటే నా చిన్నతనంలో జరిగిన ఒక సంఘటన గుర్తుకొచ్చింది. అది వేసవికాలం. ఎండవేడికి అలసటగా వగరుస్తూ ఒక ఊరకుక్క మా ఇంటి వీధి అరుగుమీద పడుకొంది. భోజనాలయేక మా నాన్న తీరుబడిగా వాలుకుర్చీలో పడుకొని ఆ సంవత్సరం పరీక్ష పేపర్లు తిన్నగా వ్రాయనందుకు నన్ను పట్టుకొని చివాట్లు పెట్టేరు. ఆ అవమానాగ్ని దహిస్తుంటే కోపంతో ముఖమెర్రగా చేసుకొని, వస్తున్న దుఃఖాన్ని అపుకొంటూ విసురుగా వీధి అరుగు మీదకి వచ్చేను.

కుక్క నాలికనుంచి చొంగ కారుతున్నది. అది నన్ను ఒకసారి చూసి, "నాన్న చేత చివాట్లు తిన్నవాడా! నీ లక్ష్యం నాకేమిటన్నట్లు మళ్ళా కళ్ళు మూసుకొంది.

ఆఖరికి ఈ కుక్కకి కూడా నేనంటే అలుసేం? చేయెత్తి "ఛీ" అన్నా కదలకుండా పడుకొంది. పౌరుషం నాలో పొడుచుకొచ్చింది. పైడు కాలువ పక్కగా రోడ్డు మరామత్తు కోసం పోసిన రాళ్ళ కుప్పలోంచి ఒక కంకరరాయి తీసుకొని బలంగా కుక్కను కొట్టేను. నా చేతిలో కంకరరాయి చూడగానే అది పరుగు తీసింది. అయినా రాయి దాని కాలికి తగిలింది. కుయ్యో ... కుయ్యో ... మంటూ కాలెత్తి కుంటుకూ అది పరుగుతీసింది.

"వెధవ కుక్క. పొగరణిగింది. చేయెత్తి అదలిస్తే కదలదేం? ఇదేం తన తాతగారి ఇల్లనుకొందా? నేనేం తన పంటికింద బొమ్మి కనుకుందా?' యుద్ధరంగంలో విజయం సాధించిన వీరుడిలా బోర విరుచుకొని ఇంటిలోకి వెళ్ళిపోయేను. నన్ను నిర్లక్ష్యంగా చూసినందుకు చక్కగా కుక్కపై ప్రతీకారం తీర్చుకొన్నానన్న సంతృప్తి కలిగింది నాకు.

రెండు రోజులనాడు ఆ కుక్క మళ్ళా గుమ్మంలో కన్పించింది. మా అమ్మ గిన్నె అడుగున మిగిలిన మెతుకులు ఓ నాలుగు రోజూ దానిముందు వేస్తుంది. అందువల్లనే ముందురోజు దెబ్బతిన్నా అది మళ్ళా మా ఇంటికి వచ్చింది. దాని కాలు పుండయ్యి, రక్తం, చీము కారు



తున్నాయి. "అయ్యో! పాపం ఏరాలుగాయి వెధవలు రాయితో కొట్టారో, కాలు విరిగిపోయింది" అంది అమ్మ జాలిగా.

ఆ రాలుగాయి వెధవని నేనేఅని అమ్మతో చెప్పే ధైర్యం నాకు లేకపోయింది. అమ్మతో పాటుగా నేనూ "అయ్యో పాపం" అన్నాను అమ్మవేసిన అన్నం మెతుకులు తిని అది గోడవారగా పడుకొని కళ్ళు మూసుకొంది బాధతో అది మూలుగుతుంటే నిజంగా నాకు కష్టం అనిపించింది. "ఏదైనా ఆసుపత్రికి తీసుకుపోయి కట్టు కట్టిస్తేనో" అన్నాను.

అమ్మ నన్ను వింతగా చూస్తూ "ఊరకుక్కకి మందూ, మాకూ ఏమిటిరా?" అంది.

ఊరకుక్కకి దెబ్బతగలగా లేందా అది మానేందుకు మందు మాత్రం ఎందుకు అక్కరలేదు? ఆ మాట అమ్మని అడిగే ధైర్యం లేదు. ఆ దెబ్బకి కారణణ్ణి నేను అని మనసు

బాధించడంచేత అమ్మ చూడకుండా కాస్త కొబ్బరి నూనెలో దూది ముంచి దాని దెబ్బకి రాయాలని ప్రయత్నించాను. అది నన్ను చూస్తూనే గర్ మంటూ పళ్ళు బయటికిపెట్టి భయంకరంగా అరచింది. నా కాళ్ళు గడగడలాడేయి. చేతిలో దూది పారవేసి గోడకి అంటుకుపోయేను. "ఒరేయ్ హాస్యం చేయకు, కరవగలదు" అంటు అమ్మ ఇంట్లోంచి కేక పెట్టింది.

వారంనాటికి కుక్క కాలు పుండు మానింది. కాని అక్కడివరకు కాలు ఎండిపోయింది. మూడు కాళ్ళమీదే కుంటుతూ నడుస్తుండేది.

ఈ ముష్టివాడి కాలు కూడా నావంటి తుంటరి వెధవల పనివల్లే అలా అయిపోయిందేమో అనిపించింది కాని, మనిషికి కుక్కతో సామ్యం చూడడానికి నామనసు అంగీకరించ లేదు. కుక్కని కొట్టినట్లు మనిషిని రాయితో ఎవరైనా కొడతారా? ఏదో ప్రమాదంలో కాలు పోయి ఉంటుంది అనుకొన్నాను.

వాడు కర్రపుల్లల్లాంటి చేతులు ముందుకిచాచి, అమ్మా... అయ్యా.. బాబూ, అంటూ నోరు ముయ్యకుండా అరుస్తూనే ఉన్నాడు. వాడి కళ్ళు బ్యాటరీ తక్కువగా ఉన్న కారు హెడ్ లైట్లలా ఉన్నాయి. వాడి కడుపు గాలి పోయిన రబ్బరు బుంగలా ఉంది ఉన్నత గిరిశిఖరాల్లా ఉన్నాయి. వాడి కణతల దగ్గర బొమికలు. వాటి కిందుగా ఉండేలోయల్లా ఉన్నాయి లోతుకు పోయిన వాడి దవడలు. పండ వారిన రెల్లుగడ్డిలా ఉంది వాడి జుట్టు. ఆ గడ్డి మొలచిన రేగడిమట్టి నేలలా ఉంది వాడు పెట్టుకొన్న గోచిపాత.

అయినా ఆకలి వాడి శక్తినంతా పిండి నాడిచే అరిపిస్తున్నాది అమ్మా .. బాబూ ... ఆకలో ..

నాకు ఏనాడూ పెద్దగా ధర్మం చేసే అలవాటులేదు. చాలీ – చాలని జీతం డబ్బులు నా కటువంటి పాడు అలవాటు కాకుండా ఇప్పటికప్పుడు కాపాడుతూ వచ్చేయి.

ఫస్టు తారీకున జీతం అందుకోగానే బుద్ధిగా ఇంటికొచ్చి అంతా శ్రీమతి చేతిలో పెడ్తాను. మధ్యాహ్న సమయంలో కాఫీకోసం, అప్పుడప్పుడు నేను వేసుకొనే కిళ్లీల కోసం తగినంత డబ్బు లెక్క కట్టి, అదనంగా మరి ఒక రూపాయి కలిపి నా స్వంత ఖర్చుకోసం జేబులో పెడుతుంది ఆమె.

"ఇదేమి ప్రారబ్ధమయ్యా! హాయిగా డబ్బంతా నీ చేతిలో ఉంచుకొని ఆడదాని ముందు చెయ్యి జాచేలా చేసుకోవాలిగాని" అనే వాళ్ళు మిత్రులు. వారికి ఇందులో ఉన్న సులువు తెలియదు. శ్రీమతి చీరలకోసం నగలకోసం రాత్రి, పగలు వేధించే బాధ తప్పుతుంది "ఈసారి జీతం రాగానే తప్పక కొనుక్కో" అనేయవచ్చు సునాయా

సంగా. జీతం రాగానే అంతా ఖర్చు చేస్తే నెలంతా గడిచేదెలా?' అది శ్రీమతి ఆలోచించవలసిన సమస్య. దానితో నాకు ప్రమేయం లేదు.

ఒక్కొక్క రోజున మరీ హృదయ విదారకంగా ముష్టివాళ్ళు అరుస్తుంటే తెలివి తక్కువగా చేయి జేబులోకి వెళ్ళేది. "హేయ్, మహాదాన కర్ణుడిలా చొరవ చూపుతున్నావ్. ఉన్నది కాస్తా ధర్మం చేస్తే, నీ కాఫీ మాటేమిటి? నీ కిల్లీల మాటేమిటి?" అని నిలదీసేది జేబు.

"ఒక రూపాయి హెచ్చుగా ఉంది కదా?" నాలో ఏమూలో మిగిలి ఉన్న మా తాతగారి రక్తం జవాబు చెప్పేది. మా తాతగారు మహాదాన పరులని ఖ్యాతి గడించేరుట. కన్న కొడుకుని అటు చదువు ఇటు ఆస్తి లేకుండా వదిలిపెట్టిన ఆయన నిస్వార్థ పరత్వాన్ని నేటికీ ఆ ఊరులో చెప్పుకుంటూ ఉంటారు. మా నాన్నగారు స్వశక్తివల్ల గుమాస్తా అయేరంటే, నన్నూ, తన అడుగుజాడల్లో నడిచేలా పెంచేరంటే అది వేరే సంగతి. మా తాతగారి రక్తం నాలో ఇంకా మిగిలి ఉన్నదని ఆ రోజునే నేను తెలుసుకున్నాను.

ఈరోజు ఆ ముష్టివాడి కాలు చూస్తుంటే చిన్నవాడు నేను రాయితో కొట్టిన కుక్క మాటి మాటికి జ్ఞాపకం రాసాగింది. 'పాపం...పాపం' అని పదిసార్లకి పైగా మనసు జాలి జపం చేసింది. పది దగ్గరవుతున్నాది. ఇంకా నా బస్సు – అంటే నేను ఎక్కవలసిన పదవ నెంబరు బస్సు రాలేదు. అది తప్ప మిగిలిన నెంబర్ల బస్సులన్నీ వస్తున్నాయి; పోతున్నాయి. నా ముందువాళ్ళు, వెనుక వాళ్ళు జాలిగా నావంక చూసి వెళ్ళిపోతున్నారు. నేను మాత్రం ఉన్నచోటనే స్థాణువులా నిలబడి ఉన్నాను. ఎదురుగా ముష్టివాడు "అమ్మా... అయ్యా... బాబూ!" నోరు మూయకుండా అరుస్తూనే ఉన్నాడు. వేసినవాళ్ళు ఒకటో, రెండో పైసలు వాడి ముందు పరిచివున్న గుడ్డలో వేసి

---

ఇరుగు పొరుగున వుండే స్కూలుపిల్లలిద్దరు స్కూలు వదిలిపెట్టాక రిక్షా ఎక్కి ఇళ్ళకు వెళుతున్నారు. అందులో ఒక పిల్ల తీయని కంఠంతో కూనిరాగం తీస్తోంది. రెండో పిల్ల "ఏమేయ్. నువ్వింత బాగా పాడతావు గదా? రేడియోలో పాడగూడదూ?" అంది.

"అమ్మో రేడియోలోనే?" అంది మొదటి పిల్ల.

"పోనీ పెద్ద రేడియోలో వద్దులే. చిన్న చిన్న ట్రాన్సిస్టర్లుంటాయే, వాటిలో పాడు" అంది రెండో అమ్మాయి.

పోతున్నారు. లేనివారు చీదరింపుగా చూసి వెళ్ళిపోతున్నారు.

రెండు నిమిషాల క్రిందట వచ్చి నా వెనక నిలచిన మార్వాడీ రోడ్డు దాటివెళ్ళి ముష్టివాడి గుడ్డమీద ఐదో, పదో పైసలనాణెం విసిరి వచ్చాడు. "ఆ మార్వాడీ మనసు వాడి అరుపులతో రెండు నిమిషాలకే కరిగిపోయిందే, అరగంటగా వింటున్నా నీలో చలనంలేదు ఎందువల్ల ?" అంటూ నామనసుని ప్రశ్నించేను.

"అదేంమాట. వాడిని చూస్తూ నేను మాత్రం కరగలేదని నీకెవరు చెప్పేరు ? పాపం...పాపం అని పదిసార్లు అనుకోలేదూ ? అది వాడి మీద జాలివల్లనే కదా !" మనసు జవాబు చెప్పింది

కాని అందువల్ల ముష్టివాడు పొందిన లబ్ధి ఏముంది ? మార్వాడీ నీలా పాపం అంటూ జపం చేయకుండా నే డబ్బులు వేసి చక్కా వచ్చేడు. ముష్టివాడికి కావలసింది డబ్బు. నీ జాలి జపం వల్ల వాడి గుడ్డలో ఒక్క పైసా ఐనా రాలిందా ?

అడిగే వాడికి చెప్పేవాడు ఎప్పుడూ లోకువే. అందుకే మనసు క్షణకాలం ఊరుకొంది. నాతో వాదనకి దిగకుండా మంచిగా మందలించడం మొదలు పెట్టింది. "నీదగ్గర ఏమంత డబ్బుందని ? కాస్త వెనకా ముందూ చూసుకో నక్కర్లేదూ ? వాడి గుడ్డలో నువ్వు వేయకపోతే ఇంకొకడు వేస్తాడు. అడుక్కునే వాళ్ళకి ఉన్న అవకాశమే అది. రేపు నీకు డబ్బు కావాలంటే ఎవరిస్తారు ? కాస్త ఆలోచించి చూడు."

దూరంగా పదవ నంబరు బస్సు ఆలస్యమైనందుకు ముఖం ఎర్రగా కంద పెట్టుకొని పరుగుతో వస్తున్నది. గాలి నా చెయ్యి చూసి ఇంకొక రెండు నిమిషాల్లో నీకు వాహన యోగం ఉందని దినఫలం చెప్పింది.

ఆ రోజువరకు నేనెంతో మంచివాడిని. మనసు చెప్పిన మాట ఎప్పుడూ కాదనలేదు కాని ఆరోజు ఎందువల్లో మనసుకి ఎదురు తిరిగితే ఎలా ఉంటుందో చూడాలనిపించింది నాకు. గబగబ రోడ్డు దాటి, ఆ వైపు కూర్చున్న ముష్టివాడి గుడ్డలో పది పైసల నాణెం పడవేసేను.

అరగంట నుంచి ఎదురుగా నిలచి ఉన్న నన్ను, ఆ ముష్టివాడు చూడలేదు అనుకోనేందుకు ఆస్కారం లేదు. నేను దగ్గరికి రావడం చూసి పరిచయస్తుడిలా ముఖం పెట్టేడు. పిప్పిపళ్ళు కొద్దిగా బయటపెట్టి చిన్నగా నవ్వినట్లు కూడా అనిపించింది నాకు. చివరకు నే నే గెలిచేను అన్నట్లు ఉంది వాడి నవ్వు.

వాడి నవ్వుతో నాకు కొంచెం కోపం తోసుకొచ్చిన మాట వాస్తవమే. ఇది నీగెలుపు కాదు. మనసు పై నేను సాధించిన విజయం అనుకొన్నాను మెల్లగా. అంతలో వాడు

తన కట్టె పుల్లలాంటి చేతులెత్తి "దండాలు బాబయ్యా" అన్నాడు. వాడి నమస్కారంతో నా కోపం పోయింది ఆ రోజు ఏదో కొత్తపని చేసే నన్న తృప్తి మిగిలిపోయింది పరుగుతో వచ్చి పదవనంబరు బస్సు అందుకొన్నాను.

మరునాటినుంచి బస్సు వేళకి కాస్త ముందుగావచ్చి ముష్టివాడి గుడ్డపై పది పైసల నాణెం విసరడం అలవాటుగా మారింది. రోజూ తన కన్న ముందుగా వస్తున్న నన్ను చూసి బస్సుముఖం చిటపట లాడించేది. తనని ఓడించడానికే నేను అలా చేస్తున్నాననుకొని ఉంటుంది. నా రాకలో పరమార్థం, ముష్టివాడి కోసం నేను చేస్తున్న త్యాగం దానికేం తెలుసు? తలవంచుకొని దిగులుగా ఖాళీ నోటితో కొట్టుదాటి పోతూంటే తెల్లబోయి చూసిన కిళ్లీ కొట్టువాడికి తెలుసు. కాని,

ఇలా ఈ దానకాంక్ష ఒక సంవత్సరం పొడుగునా రోజూ, ఆది వారాలు, సెలవురోజులు, మినహాయిస్తే జరిగిపోయింది. ఇక్కడ పరిస్థితి అర్థమయ్యేందుకు కథనాన్ని కాస్త పక్కకి తిప్పక తప్పదు.

ఒక నెలజీతం సంవత్సరాంతంలో బోనస్‌గా ఇచ్చే ఆచారం మా కంపెనీలో ఉంది. రానున్న ఆ సొమ్ము తలచుకొంటూ అది ఎలా ఖర్చు చేయాలా అనే ఆలోచనతో మేమంతా — అంటే నా వంటి చాలీచాలని జీతాలు అందుకొం



టున్న గుమాస్తాల మంతా ఏ డా ది పొడుగునా తలలు బద్దలు కొట్టు కొంటూ ఉండేవాళ్ళం. కాని తీరా అది చేతికి అందేసరికి, ఆ వాసన మరి వాళ్ళకి ఎలా తెలిసేదో అప్పుల వాళ్ళు గ్రద్దల్లా ఫీసు గుమ్మంలోనే కాచివుండి సగానికిపైగా భక్షించి మరీ వదలిపెట్టేవారు. ఆ సంవత్సరం అంతా ఆలోచించి ఒక పథకం వేశాము. ఆ సొమ్మంతా నెల తిరిగే వరకు ఆఫీసులోనే దాచి ఉంచాము. ఇంక అక్కడ తిండి ఆశ లేదని ఆ గ్రద్ద లన్నీ నిరాశతో ఎగిరిపోయేక సంతోషంగా మా జేబులు నింపుకొన్నాము.

అందువల్లనే ఆ రోజు ఎంతో ఉత్సాహంగా ఉంది. ఆ ఉత్సాహంలో ముష్టివాడికి కూడా పాలు పంచిపెట్టాలను కొన్నాను వాడికి కూడా ఒక నెల ముష్టి, ఆజ్ఞా యింపుగా రెండున్నర రూపాయలు బోనస్‌గా ఇయ్యాలనుకొన్నాను.

"మరీ అంత అవసరం లేదు. అందులో సగం. సగం అంటే అక్షరాల సగం కాదు, ఒక్క రూపాయి దానంచెయ్యి చాలు" అంది మనను.

ముందే చెప్పేను కదూ మనసుకి ఎదురు తిరగడం నేర్చుకొన్నాననీ, దానితో ఏదో విధమైన ఆనందాన్ని పొందుతున్నాననీ "చేసి చేసి చచ్చుగా ఒక రూపాయి దానం ఏమిటి? నువ్వు ఫలానావారి మనుమడవని మరచిపోకు–" తాతగారి రక్తం సమయానికి సరిగా హెచ్చరించింది. మనసు పై ధైర్యంగా ఎదురు తిరిగే శక్తి నాలో పొదులు కొంది. తాతగారి త్యాగ రక్తం నాలో జలజల ప్రవహించింది "ఒక రూపాయి కాదు. ఐదు రూపాయలు దానం చేస్తాను. నా సొమ్ము–నా యిష్టం" అన్నాను మనసు నోరు నొక్కివేస్తూ.

"నీకు పిచ్చి పట్టుకొంది. ఈ దానంతో నువ్వు స్వర్గానికి మెట్లు కట్టాలను కొంటున్నావు — " అంది మనసు వ్యంగ్యంగా నవ్వుతూ. "శబాష్ మనుమడా" అంది తాతగారి రక్తం.

సాయంకాలం ఆ ముష్టివాడు అక్కడ కూర్చొడు. రెండో పూట వాడి ఆఫీసు ఇంకో వీధికి మార్చుకుంటాడు. ఆ వీధి నాకు తెలుసు. ఒకటి, రెండు సార్లు స్నేహితుల ఇళ్ళకి పోతూ వాడిని అక్కడ చూశాను. కాని అక్కడికిపోయి వాడికి దానం చేయాలనే సంకల్పం నాకు లేదు. అసలు అక్కడి ముష్టివాడితో నాకు పరిచయమే లేదు. పదవ నంబరు బస్సు స్టాపుకి ఎదురుగా కూర్చునే ముష్టివాడికే నేను దానంచెయ్యాలి. వాడే నా ముష్టి వాడు. వాడే నాలో దాగివున్న దానగుణం కదిలేలా ప్రేరేపించినవాడు. నేను చిన్ననాడు రాయితో కొట్టిన ఊర కుక్క లాంటివాడు మనసుకి ఎదురు తిరిగి పనులు చేయటంలో ఉన్న మజా చూపించినవాడు. వాడు

మరునాడు ఉదయంకాని అక్కడ ఉండడు

ఇంటికి చేరేక సొమ్ము అంతా అర్ధాంగి చేతిలో పెట్టడం ఆచారం. ఐదో, పదో దాచి ఉంతే యిచ్చా రంటూ ఎబద్ధం చెప్పే అలవాటు నాకులేదు. నేను ఏడాది క్రిందటి వరకు ఎంతో మంచి వాడిని. ఈ నిమిషం వరకు ఎంతో నిజాయితీ పరుడిని. కాని ఆ రోజున ఆ ముష్టి వెధవకోసమే మనసుని ఎదిరించ మంచి వాడిని అన్న బిరుదును కోల్పోయాను. ఈ రోజు వాడికోసం ఇంకో త్యాగం చేస్తున్నాను. వాడికి ఇదేం పట్టుదు. అమ్మా! అయ్యా! అనే తన అరుపులకే గుడ్డలో డబ్బులు రాలుతున్నాయను కొంటాడు. నేనెన్ని కష్ట, నిష్ఠురాలు భరిస్తూ వాడికి దానంచేసున్నానో ఆ కుంటి వెధవకి ఏం తెలుసు?

ఐదు రూపాయల కాగితం కిల్లీ కొట్టువాడి చేతిలో పెడుతూ "నీ దగ్గర ఉంచు, రేపు తీసుకొంటాను" అన్నాను.

మరునాడు ఉదయం మరికొంచెం ముందుగానే ఇంటినుంచి బయలు దేరేను. మరి వెయ్యబోయేది లాకాయి లూకాయి ముష్టా? ఐదు రూపాయల ముష్టాయెను. ఆ అనుభూతిని పూర్తిగా అనభవిస్తూ, ఎవరైనా చూస్తున్నారా లేదా అని ఇటు అటు పరికిస్తూ, నెమ్మదిగా వెళుందాగా, అంత త్యాగానికి సరిపడిన ప్రతిఫలం అందుకోటీటూ చేయాలాయెను

రోజూ కన్న ముందుగాపోతున్న నన్ను రోడు పలకరించింది. రోజూకన్న జోరుగా పోతున్న నన్ను కాలం మందలించింది. నేను అసలు విషయం వాటితో చెప్పలేదు చెప్పినా అవి అర్థం చేసుకోలేవు 'నీలాంటి గుమాస్తాకి ఐదు రూపా

బట్టలషాపులో గుమాస్తాతో ఒకావిడ:

"ఈ చీరలన్నీ అసహ్యంగా వున్నాయి. ఇంతకంటె మంచివి లేవా?"

గుమాస్తా: "ఉన్నాయిగానండి, ఇప్పుడు అసహ్యంగా వుండడమే ఫ్యాషనండి."

యల ముష్టేమిటి? నోట్లు చుట్టి వేసేమిషనుకాని తయారుచేసేవా?' అంటూ ప్రశ్నిస్తాయి. అందుకే తల వంచుకొని మౌనంగా నడచి పోయాను.

కాని ఆశ్చర్యం; ఆరోజు ముష్టివాడు అక్కడ లేడు. బజారు రోడ్డు ఎంత రద్దీగా వున్నా- వాడి అరుపులు లేని కారణంగా నిశ్శబ్దంగా ఉంది నిర్భాగ్యుడు ఐదు రూపాయలు దానం చేద్దామనుకొంటే ఈరోజే

రాకుండా మానుకొన్నాడేం – అను కొన్నాను. నాకెందుకో భయం వేసింది. నిష్కారణంగా ఐదు రూపాయల దానఫలం తప్పిపోతుందేమో అన్న కంగారు పుట్టింది. వాడు ఇంకో చోటుకి వెళ్ళిపోయి ఉంటే? రాత్రికి రాత్రే చచ్చిపోయి ఉంటే?

"వెధవ, వాడికి ప్రాప్తంలేదు. హాయిగా ఏదైనా ఖర్చుపెట్టుకో–" మనసు సలహా సరఫరా చేసింది. 'నీ బోడిసలహా ఎవరూ కోరలేదు!' అని మనసుని చీదరించుకొంటూ ఇటు అటు మరికాస్త పరిశీలనగా చూసేను. ఏ కారణం వల్లనైనా చోటు కాస్త మార్చేడేమో... ఆలోచనల్లో పడి నేను కాస్త పక్కగా నిల్చేనేమో?

కనుచూపు అనినంత వరకు వాని రూపం ఎక్కడా కన్పించలేదు. చెవులకి వాడి అరుపులు వినిపించలేదు. "ఇక్కడ కూర్చునే ముష్టివాడు ఈ రోజు రాలేదేమా?" స్వగతంలా పైకి విన్పించేటట్టు అనుకొన్నాను "ముష్టి వెధవలకి ఒక చోటేమిటి? ఎక్కడ నాలుగు డబ్బులు రాలుతుంటే అక్కడికి తయారవుతారు" అన్నాడు నా పక్కన నిలబడ్డవాడు. "కాని, ఏడాదిబట్టీ చూస్తున్నాను. రోజూ వేళ తప్పకుండా..." "బజారు వీధికదా, అందువల్ల కాస్త ఎక్కువ కాలమే గిట్టుబాటుగా ఉండివుంటుంది" నా మాటని మధ్యలోనే అందుకొన్నాడు ఇంకొకడు.

పదవ నంబరు బస్సు వందిలా ఝురద చిమ్ముకొంటూవచ్చి స్టాపులో నిలబడింది. ఆఖరిసారిగా ఆ ముష్టి వాడికోసం ఇటు అటు చూశాను. ముష్టివాడు రాలేదు. నా జేబులో ఐదు రూపాయల నోటు బరువుగా దిగలాగింది. మనసు దారిపొడుగునా దగుల్బాజీ సలహాలు అందిస్తునేవుంది.

ఆఫీసునుంచి తిరిగివస్తూ ఆ నోటు కిళ్ళీకొట్టు వాడి చేతిలో పెట్టేను. "నేను అడిగేసరకు నీ దగ్గర వుండనీ" అన్నాను. కంటపడితే ఇంటావిడ కైంకర్యం చేస్తుందనా అన్నట్లు నవ్వేడు వాడు 'ఒకరికి అప్పు తీర్చాలి' వాడు అడక్కపోయినా సంజాయిషీ ఇచ్చుకొన్నాను

మరునాడు కూడా ముష్టివాడు రాకపోతే నేను ఇంత ఔదార్యంగా చేయాలనుకొంటున్న ఐదు రూపాయల దానఫలం ఏం కాను? నన్నింతగా ఆరాటపెడుతున్న ఆ ముష్టివాడిని ఏం చెయ్యాలి? ఆలోచనలతో ఆ రాత్రి సరిగా నిద్ర పట్టలేదు.

* * *

ఆ తరువాత చాలా రోజులకి వాడు మళ్ళా కన్పించేడు. బజారు వీధిలో కాదు, ఆస్పత్రిలో. నేను దెబ్బలతో బాధపడుతూ మంచం మీద మూలుగుతున్న సమయంలో. ఆ అన్నట్లు ఈ దెబ్బలు, ఆస్పత్రి వగైరా విషయాలు చెప్ప లేదుకదూ?

అసలు ఏం జరిగిందో పూర్తిగా నాకూ తెలియదు.

నేను ఆ మరునాడు మామూలుగా వాచీముల్లు చూసుకొంటూ రోడ్డుమీద నడచిపోతున్నాను. మా వీధిలో ఉన్న ఒకే ఒక మేడలో ఆ రోజునే అద్దెకు దిగిన ఒక పెద్ద ఆఫీసరుగారి సామానులతో నలభై మైళ్ళ వేగంతో వస్తున్న లారీ ఆప్యాయంగా నన్ను ముద్దు పెట్టుకుంది. అది కాస్త మోటు సరసం కావడంతో నేను పదిరోజుల పాటు ఒంటిమీద తెలివి లేకుండా ఆస్పత్రిలో పడివున్నాను.

నాకు తెలివి వచ్చేక మా శ్రీమతి కళ్ళు తుడుచుకొంటూ, ముక్కు చీదుకొంటూ ఇదంతా చెప్పింది. "నా మంగళసూత్రం బలం వల్ల కాని లేకపోతే మీకు బ్రతికే దెబ్బలు తగిలాయా" అంటూ పదేపదే పైట లోంచి పుస్తెలు తీసి కళ్ళ కద్దుకో సాగింది.

నిజంగా నాకు చచ్చే దెబ్బలే తగిలాయి. పాదం లేని ఎడమకాలు చూసుకొన్నాక చచ్చిపోయినా బాగుండేది అనిపించింది. మిత్రులు, బంధువులు ఎంతగా ధైర్యం చెప్తున్నా తీసివేసిన పాదం తిరిగి అతకబడదు కదా? కృత్రిమంగా ఒక పాదం తగుల్చుకొని, అది కనిపించకుండా యాతన పడుతూ బతుకు సాగదియ్యాలి అనే ఆలోచన నాకేమంత సుఖమయింది కాదు.

ఆ వార్డులో ముక్కా చెక్కా పోకుండా పాళంగా ఉన్న మనిషి ఒక్కడు కూడా లేడు. అందులో ఎవరితో నన్ను సరిపోల్చుకొని సంతోషించే వీలుంటుందా అని ఇటు అటు చూస్తున్నాను అప్పుడే కన్పించాడు ఆ ముష్టివాడు. ఊతకర్ర ఆసరాతో మెల్లగా మంచాల మధ్యనుంచి నడుస్తున్నాడు ఎదురుగా కన్పించిన నర్సుని ఏదో అడిగేడు. ఆవిడ చీదపురుగని ఆకుమీద చూసినట్లు విదిలిస్తూ విసురుగా ఏదో జవాబు చెప్పింది.

వాడు మెల్లగా నా మంచం సమీపంలోకి వచ్చేడు. నా మంచం పక్కగా వున్న వరండా వైపు ఉన్నాయి వాడి చూపులు. నేను అదివరలో చూసినప్పటికన్న దీనంగా వున్నాడు. పొడుచుకు వస్తున్న ఆ ఎముకల మీద చర్మం ఉందా, లేదా అన్నట్టు అనిపిస్తున్నది ప్రాణం పోసుకు నడచివస్తున్న అస్థిపంజరంలా ఉన్నాడు.

వాడిలాంటి వాళ్ళు ఈ బీద దేశంలో చాలా మంది ఉండవచ్చు. కాని వీడు పదవనంబరు బస్సు స్టాపుకి ఎదురుగా కూర్చునే ముష్టివాడు. అదివరలో వాడికి దానం చేద్దామనుకున్న ఐదు రూపాయల నోటు అప్పుడు దగ్గర ఉంటే వాడి ముఖాన విసిరికొట్టి "వెధవా పోయి కడుపునిండా ఇంత తిని మరీ కన్పించు" అంటూ తరిమివేసేవాడిని. కాని ప్రస్తుతం నాదగ్గర ఒక్క పైసాకూడా లేదు. ఇటు అటు మంచాలమీద ఉన్నవారు నావంటి వారే. అప్పు అడిగినా ప్రయోజనం ఉండదు.

నేను వాడి దీనస్థితి గురించి ఆలోచిస్తుండగానే వాడు నా మంచానికి ఇంకా దగ్గరికి వచ్చేడు. వాడు నన్ను చూసి పోల్చుకొనే అవకాశం లేదు. తలకంతా కట్టు ఉంది. చాలా రక్తం పోవడంచేత ముఖమంతా పాలిపోయి, కళ్ళు పైకి పొడుచుకు వచ్చినట్లు ఉన్నాయి ఆ రోజు ఉదయాన్నే శ్రీమతితో పోట్లాడి అద్దంలో ముఖం చూసుకొన్నాను. "నేను చిన్న పిల్లవాడిని కాదుగదా; ఎలా ఉన్నా జడుసుకోనులే" అన్నాను. కాని నిజానికి నా ముఖంచూస్తే నాకే జాలి కలిగింది. గొంతుకలో గురగురమంటూ ఏడుపు ముంచుకొచ్చింది. ఇంకా భయం కూడా తొంగిచూసింది ఎందుకు బ్రతికిపోయానా అని బాధపడ్డాను.

అయినా వాడు నన్ను పోల్చుకొన్నట్లే నవ్వేడు. ఆ మొదటి రోజు నేను పదిపైసలు దానం చేసినప్పుడు నన్ను చూసి నవ్వినట్లే ఉంది ఆ నవ్వు. ఏ పరిస్థితుల్లో ఉన్నా కుక్క తన యజమానిని పోల్చుకోగలదట. ముష్టివాళ్ళకి కూడా అటువంటి శక్తి ఉందేమో మరి. "నా అవిటితనంచూసి అంతగా జాలిపడేవాడివి. ఇప్పుడు నీ పని ఏమయింది అబ్బాయి" అని పరిహాసం

చేస్తున్నట్లు ఉన్నాయి వాడి చూపులు.

నా చిన్నతనంలో కాలు విరిగిన ఊర కుక్కకి మందు పెట్టబోతే గర్‌మని మొరిగినట్లు ఉంది వాడి మాట. "బాబూ, ఆరో నంబరు వార్డుకి దారి ఇదేనా?" వాడు ఆ ప్రశ్న నన్ను అడగలేదు. వరండాలో పోతున్న ఏ జమాదారునో అడిగేడు.

"పాపం... పాపం ఎంత దీనం — మాట్లాడుతున్నాడో! ఎండు కర్రలా ఎలా ఉన్నాడో—" మనసు జాలి జపం మొదలు పెట్టింది. నా ఒంటికి కారం రాసుకొన్నట్టు మండింది. "ఈ స్థితిలో ఉన్న నా మీద నీకు జాలి లేదుకాని, ఆ కృతఘ్నుడి మీద చూపిస్తున్నావు" అంటూ కోపగించుకొన్నాను.

కృతఘ్నుడా? ఏమీ ఎరగనట్లు మనసు ప్రశ్నించింది.

"కాదూ? ఏడాదిపాటు కిల్లీ మానుకొని వాడికి ధర్మం చేసేనే. ఎప్పుడూ లేనిది శ్రీమతి దగ్గర అబద్ధం ఆడి వాడి కోసం ఐదు రూపాయలు దాచేనే ... నా మంచితనాన్ని వాడు గ్రహించేడా? చూసి కూడా అయ్యో బాబూ! అన్నాడా? పైగా నవ్వుతాడుట ... నవ్వు ... ...

కోపంతో నా మెదడులోని నరాలు పటపట లాడేయి బాధగా అమ్మా అని తల పట్టుకొన్నాను. ఆ సరికి వాడు నా మంచానికి ఇంకా చేరువగా వచ్చేడు. పోల్చుకొన్నట్లే చూసేడు. క్షణకాలం ఆలోచనగా ఇటు అటు చూసేడు. ఒక్క నిమిషంపాటు నా కళ్ళవంక చూసేడు. ఎంతో జాలిగా, ఓదార్పుగా ఉన్నాయి ఆ చూపులు. "అయ్యో బాబూ, మీరా? ఏమిటి ఇలా అయిపోయేరు. మీ వంటి ధర్మప్రభువులకి ఇట్లాంటి ఆపద ..." అలవాటుపడిన వాడి గొంతుక

---

ఒక ఇల్లాలు పొరుగింటావిడతో :-

"ఈ మగవాళ్ళని నమ్మడానికి వీల్లేదమ్మా!"

పొరుగింటావిడ:- ఏం అలా అంటున్నారు?"

ఇల్లాలు :- "రాత్రి నాకో కల వచ్చింది. మా ఆయన ఎవరో అందమైన పిల్ల వెంటపడి పోతున్నాట."

పొరుగింటావిడ :- "అదంతా కలే కదండీ?

ఇల్లాలు :- "అదికాదమ్మా! నా కల్లోనే అంత బరితెగించినవారు ఇహ ఆయన కల్లో ఇంకెంత అఘాయిత్యం చేస్తున్నారోనని ..."

---

లోంచి రాబోయే మాటల కోసం నా చెవులు రిక్కించుకొని వింటున్నా.

వాడు పెదవి కదపకుండా నా మంచం దాటిపోతున్నాడు. నాలో సహనం సన్నగిలింది. నాలోని మంచితనం మంట కలిసింది. ఊపుగా పక్కకి ఒత్తిగిల్లేను శక్తినంతా కూడ దీసుకొని వాడి చేతికింది ఊత కర్ర లాగేశాను.

దభేలుమని వాడు పడిపోయేడు. "అమ్మో" అని బాధతో కేక పెట్టేడు. నాచేత రాతి దెబ్బతిన్న కుక్క అరుపులా ఉంది వాడి కేక. నాకు తృప్తి కలిగింది. వాడి కృతఘ్నతకి చక్కని బహుమానం ఇచ్చేనంటూ మురిసిపోయేను.

కాని అంతలోనే ఏదో భయం. పాపం చేసేనన్న భయం పట్టుబడి పోతానన్న భయం. ఎవరైనా చూసేరేమో అన్న భయం ఏమైనా ప్రశ్నిస్తారేమో అన్న భయం.

తలమీదుగా దుప్పటి ముసుగు పెట్టి నిద్ర నటించేను. వాడు అరచిన కేక, పడ్డిన చప్పుడు విని చుట్టుపక్కల మనుష్యులు గుమిగూడేరు. "ఎలా పడిపోయాడు?" ఎవరో ప్రశ్నిస్తున్నారు "అదిగో ఆ మంచం మీద ఆయన తోసేసేడు. వాడి చేతికింద కర్ర లాగేసేడు—"ఎవరో చెప్తున్నట్లు వినిపించింది. "కర్ర నేల మీద జారి పట్టుతప్పి ఉంటుంది" ఎవరో జవాబు చెప్పేరు.

నా బుర్ర రంగుల రాట్నంలా తిరిగిపోతున్నాది. బాధతో నా వెంట మీద తెలివి తప్పిపోతున్నాను. "సాయంకాలం నేను వెళ్ళేసరికి సరిగానే ఉన్నారు డాక్టర్. ఇంతలో ఇంతగా ఏమయ్యింది?" శ్రీమతి ప్రశ్న ఏడుపు కంఠంతో బాధగా వినిపించింది.

"ఏమయిందో వెంటనే చెప్పడం కష్టం. కుట్లన్నీ కదలిపోయినట్లు ఉన్నాయి. ఎక్స్‌రే తీసి చూడాలి" డాక్టరు జవాబు నాకు మత్తులో మెల్లగా వినిపించింది నాకు.

* * *

ఆరునెలల తర్వాత వీధిలో తిరిగి కాలు పెట్టేను. ఇదివరలో అవసరం లేకపోయినా అడుగులతో రోడ్డు కొలుస్తూ నడిచేవాడిని. ఇప్పుడు అశక్తత కొద్దీ ఇంకా మెల్లిగా నడుస్తున్నాను. "బాబూ! కులాసాగా?" ఐదు రూపాయల నోటు నా చేతిలో పెడుతూ కిళ్లీకొట్టువాడు ప్రశ్నించేడు.

దానిని చూడగానే ఆ నోటుకి హక్కుదారుడు అయిన ముష్టివాడు జ్ఞాపకం వచ్చేడు. ఆనాటి సంఘటన గుర్తుకొచ్చింది. పశ్చాత్తాపం గుండెల్లో పోటులా పొడిచింది. పాపం నన్ను పోల్చుకోలేడేమో? నలుగురిలోనూ పలకరిస్తే ఛీత్కరించుకొంటాననుకున్నాడేమో? అన్యాయంగా వాడిని తోసివేసేను. ఏం దెబ్బలు తగిలేయో? ఎలా ఉన్నాడో? వాడికి మందు మాకులు

వేసేందుకు ఇంట్లో ఎవరైనా ఉన్నారో లేరో - అడుక్కొనే శక్తి లేక ఆకలి బాధ పడలేక ఎంతగా ఏడుస్తున్నాడో? ఈ సొమ్ము వాడిది. మానసికంగా వాడికి దానం చేసింది. ఇది వాడికి అందచేస్తే ఎందుకైనా పనికివస్తుంది.

పది నిమిషాలు గడచేసరికి బస్సు స్టాపు చేరుకొన్నాను. ఎదురుగా పేవ్‌మెంట్ మీద గోనెపట్టా పరచి ఉంది. ఆశగా అటు చూపు తిప్పేను. అక్కడ ఆ కుంటివాడు లేదు. ఆ స్థలాన్ని ఒక ముష్టిది ఆక్రమించుకొంది. వెన్నుకి అంటుకుపోయి ఉన్న కడుపుతో, అర్ధనగ్నంగా ఉన్న ఒడలితో, ఎండిపోయిన రొమ్మును పిల్లనోటికి కుక్కి దీనంగా "అమ్మా... బాబూ... అయ్యా" అని అరుస్తున్నాది. తల్లి రొమ్ములోంచి ఎంత పీకినా పాలు రాక ఆ పిల్ల గోల గోలగా ఏడుస్తున్నాది.

ఆ ఐదు రూపాయలనోటు దాని ముఖంమీద కొట్టి "పో... పోయి నీ బిడ్డకిన్ని పాలు కొనుక్కో ... నీ కడుపుకింత తిండికొనుక్కో" అనాలని పించింది. కాని ఆ సొమ్ము నాది కాదు. దానిని వేరొకరికి దానం చేసేందుకు నాకు ధైర్యం లేదు.

ఆఫీసుకి వెళ్ళబుద్ధికాక వెనక్కి తిరిగి వచ్చేశాను "ఏం వంట్లో బాగా లేదా?" శ్రీమతి ప్రశ్నించింది. "సరిగానే ఉంది కాస్త బడలికగా ఉంది" జవాబుచెప్పి మంచంమీద వాలిపోయేను.

కాని ఆ బడలిక అంత సులువుగా తీరేదికాదు. రోజూ కలత నిద్రలో కాలు విరిగిన కుక్క అరుపులు, దభీలుమని నేల పడ్డ ముష్టివాడి కేకలు నన్ను వెంటాడుతూనే వున్నాయి ఆ కుక్క కాలుకి మందు పెట్టగలిగితే, ముష్టివాడికి ఈ ఐదు రూపాయలు అందివ్వగలిగితే నా మనస్సుకి శాంతి కలిగేదేమో? ఆ సంఘటనలను సులువుగా మరవగలిగే వాడినేమో?

ఒక్కోసారి అనిపిస్తుంది నాకు, ఇది భగవంతుడు విధించిన శిక్ష అని.

***

# ప్రముఖుల




ఒకసారి మహాకవి జయశంకర ప్రసాద్ తాను వ్రాసిన "చంద్రగుప్త" నాటకానికి డైరెక్టరై ప్రదర్శింపజేశాడు. నాటకం పూర్తి కాగా తిరిగివస్తున్న ప్రసాద్‌ను ఒక మిత్రుడు ఇలా అడిగాడు 'నాటకమెలా జరిగింది?

దానికి జవాబుగా జయశంకర ప్రసాద్ ఇలా అన్నారు.

"నాటకం మహా బాగా జరిగింది. కానీ ప్రేక్షకులు ఫెయిలయ్యారు."





ఒకసుప్రసిద్ధ అర్థశాస్త్రవేత్త మహాత్మా గాంధీజీతో ఇలా అన్నాడు. "బాపూ! మేకపాలు త్రాగడం అంత మంచిదికాదు. పశువుల పాలను త్రాగడంవల్ల మనుష్యునిలో పశుత్వం వస్తుంది."

అప్పుడు బాపూజీ పడుకునే సమయం. అందువల్ల బాపూజీ పడుకుంటూ "నిజమే! మేకపాలు త్రాగడంవల్ల నాకిప్పుడు కొమ్ములు వస్తున్నాయి. ఇక్కడినుంచి పరిగెత్తు, లేకపోతే కుమ్మివేస్తాను" అనిఅన్నారు.

—— సి. నాగేశ్వరరావు ——



ఒకసారి గాంధిజీతో ఇంగ్లీషు విద్యయందు చాలా అభిమానం ఉన్న ఒక సజ్జనుడు మాట్లాడడానికి వచ్చాడు. తనను గురించి చెప్పుకోవడంతోనే ఆ సజ్జనునకు సరిపోయింది. మాటలు పూర్తికాగానే "నేను ఏమైనా మీకు సహాయం చేయాలని ఇష్టముంటే చెప్పండి. చేస్తాను" అని అన్నాడతడు. అతని అభిప్రాయమేమనగా బాపూజీ తనను హరిజన్ పత్రికకు ఏదైనా వ్రాయమని అడుగుతారని.

"చాలా సంతోషం. మీకు తీరికవుంటా?" గాంధీజీ అతణ్ణి అడిగారు.

"ఉంది. నిస్సంకోచంగా చెప్పండి."

"ఆశ్రమంలో గోధుమలు చాలా ఉన్నాయి. విసరడంలో కొంచెం సహాయం చెయ్యండి." అని అన్నారు గాంధీజీ.

శ్రీ లోకమాన్య తిలక్ వినోద స్వభావులు, ఒకసారి తమపిల్లలతో కూర్చుని టీ త్రాగుతున్నారు. పిల్లలూ తిలక్ గారు ఇలా మాట్లాడుకున్నారు.

పిల్లలు:- బాబా, మేము టీ త్రాగేటప్పుడు బిస్కెట్లు తింటాం. మీరు ఏమీ తినరెందుకు?

తిలక్:- ఎందుకు తినను? నేనేమీ తిననని మీరెందుకు అనుకున్నారు? నేను కూడా తింటాను

పిల్లలు :- మీరేమి తింటారో మాకు కనుపించనిదే?



తిలక్ : అవును! అది మీకు కనిపించదు. వార్తా పత్రికల్లో పడే తిట్లను రోజూ నేను టీ త్రాగేటప్పుడు తింటాను.

***

# తీరని వెతలో తీయని గాథలు

సి. ఆనందారామం

## 3

[గత సంచిక తరువాయి]

పాఠకుల దగ్గర్నుంచి అసంఖ్యాకంగా వస్తున్నాయి ఉత్తరాలు.

'సరళక్కా!

మీ రచన చాలా బాగున్నది. వాస్తవికతకు ఎంతో సమీపముగానున్నది. నిజము. ఈ రోజులలో మొగవారి అహమునకు మితి లేకున్నది. తమ భార్యలలో నున్న ఔన్నత్యమును గ్రహింపరు సరికదా, దాని నణగద్రొక్కుటకే ప్రయత్నింతురు. మీ రచనలు ఇట్టివారి కనులు తెరిపించగలవని ఆశించుచున్నాను.

సోదరి

... ... ...'

'మైడియర్ సరళాదేవీ!

మీ రచన నన్నాకర్షించింది. సంఘంలో ఆడవాళ్ళకు జరుగుతున్న అన్యాయాన్ని మీరు చక్కగా చిత్రీకరిస్తున్నారు. నాకు మీతో స్నేహం చేసుకోవాలనుంది. వెంటనే సమాధానం వ్రాస్తారుకదూ!

'శ్రీమతి సరళాదేవిగారూ!

నేనొక యువకుణ్ణి ప్రేమించాను. అతడు నన్నూ ప్రేమించాడు. కానీ, అతనికిదివరకే వివాహమైందని తెలిసింది. ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?

... ... ..'

'సరళక్కా!

మీ రచన ఎంత బాగుందనుకున్నారు? నాకు మీ ఫోటో ఒకటి పంపరూ. నేనూ ఏదో కొద్దిగా రాస్తానండీ! ఎలా రాయాలో తెలియటంలేదు. నా రచనలు మీకు పంపుతాను. దయచేసి చదివి ఎలా రాయాలో కాస్త చెప్పుదురూ? ఆ రచనలన్నీ వీలయినంత త్వరలో పంపుతాను.

... ... ..'

'మిసెస్ సరళా!

మీరు వ్రాస్తున్న రచనలు చదువుతుంటే నిజంగా నన్ను చూసే వ్రాస్తు

సీరియల్

న్నారా? అనిపిస్తోంది. నాకు సంగీతం ఎంతో బాగా వచ్చు. కానీ, నేను వీణ ముట్టుకున్నప్పుడల్లా మావారు రెండు చెవులూ మూసుకుని "ఇంట్లోంచి పారిపొమ్మంటావా? వీణ మూల పట్టేస్తావా?" అని గోల పెట్టేస్తారు. మీ రచన చదువుతూంటే అదంతా కళ్ళకు కట్టినట్లనిపించింది. నాలాటి అభాగ్యులెందరో అనుకున్నాను. మీకు నా అభినందనలు.

.... .... ...."

"డియర్ మేడమ్!

మీ స్వతంత్ర భావాలు నాకు చాలా నచ్చాయి. మీతో స్నేహం చేసుకోవాలని కుతూహల పడుతున్నాను. ఈ దిగువ ఎడ్రస్‌కి సమాధానం వ్రాయండి.

.... .... ...."

ఈ ఉత్తరాలకట్టలను చూసుకునే సరికి సరళకు కళ్ళు గిర్రున తిరిగినట్లనిపించేది. సుదర్శనం మాత్రం ఓపిగ్గా చదువుకుని పొంగిపోయేవాడు.

"వీటన్నింటికీ సమాధానాలు వ్రాయి సరళా!" అన్నాడు.

హడిలిపోయింది సరళ.

"నాకు దగ్గర స్నేహితులకే నేను సరిగ్గా సమాధానాలు వ్రాయను. వీటికన్నింటికీ అసలు రాయలేను. ఏదో వ్రాయటం చేతనయింది. వ్రాస్తున్నాను. అంతమాత్రంచేత సర్వజ్ఞత్వాన్ని అంటగట్టి వ్యక్తిగత సమస్యలన్నీ పరిష్కరించమంటే ఎలా చావను?"

"నువ్వు పరిష్కరించక్కర్లేదు. వాళ్ళు కోరుతున్నది పరిష్కారం కాదు. సమాధానం — పరిష్కారం వాళ్ళకే తెలుసు"

నవ్వాడు సుదర్శనం.

"తమ రచనలు పంపిస్తారట! నేను చూసి సరిదిద్దాలట!"

"నువ్వు సరిదిద్దక్కర్లేదు. సరిదిద్దితే వాళ్ళు సహించలేరు. చూడనుకూడా అక్కర్లేదు. బాగున్నాయని ఇచ్చెయ్యి. అదే వాళ్ళు కోరుతూంట. ఆ తరువాత బాగోగులు పత్రికాధిపతులే నిర్ణయిస్తారు."

సుదర్శనం బలవంతంమీద ఆ ఉత్తరాలకు సమాధానం వ్రాయటమొక కార్యక్రమమయిపోయింది సరళకు.

విసుగ్గా ఉత్తరాలు చూస్తున్న సరళ రావు దస్తూరి కంటపడగానే చటుక్కున ఆగిపోయింది. ఆత్రంగా తీసి చదివింది.

"సరళా!

నేనెంత బద్ధకస్తుణ్ణో నీకు తెలుసు—అయినా ఓపిగ్గా ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. నీ రచన చదివాక ఇది వ్రాయకుండా వుండలేక పోతున్నాను.

మొదటిది—నీ శైలి నాకు నచ్చలేదు. అనవసరంగా సంస్కృతభాషను ఉపయోగిస్తావు. కథకు ముఖ్యమైంది

పాత్రోచిత సంభాషణ – ఇల్లాలుతన భర్తతో మాట్లాడుతూ ప్రౌఢసంస్కృత పదభూయిష్టసమాససరళిలో మాట్లాడుతుందా? పాకము – శయ్య–రీతి– ఇవి నేర్చుకున్న నువ్వు రసోచితరీతిని పాటించకపోవటం విచారంగావుంది

రెండవది – పాత్ర పోషణ నువ్వేమీ అనుకోకపోతే, నీ పాత్రల్లో జీవంలేదు. అవి వట్టి బొమ్మల్లా ఉన్నాయి. ఈ పాత్ర పోషణగురించి బాగా అర్థమయ్యేలా చెప్పాలంటే దీన్ని చిత్రకళతో పోల్చాలి

ఒకడు ఒక సజీవమూర్తిని యథాతథంగా చిత్రిస్తాడు.

మరొకడు పెద్దకళ్ళు, చక్కని ముక్కు, చిన్న నోరు– మొదలైన హంగులతో అందమైన బొమ్మ గీస్తాడు

ఎవరి చిత్రం గొప్పదంటావు నువ్వు? మొదటిచిత్రం అందంగా ఉండకపోవచ్చు–అది సజీవమూర్తికి ప్రతిబింబం గనుక. కానీ ఆ అనాకారితనపు చిత్రీకరణలోని అందమే నీ మనసు నాకట్టుతుంది. రెండవ చిత్రంలో అపూర్వ సౌందర్యం కనిపించినా, దానిలో ఏదో కృత్రిమత్వం నీకనుభూతమవుతూనే ఉంటుంది.

కళ దృష్టితో ఆలోచిస్తే మొదటిదే ఉత్తమ చిత్రమని ఒప్పుకోక తప్పదు

రచన విషయంలోనూ ఇంతే! నీ పాత్రలు సజీవ మూర్తులను ప్రతిబింబింపజేస్తే వాటిల్లో జీవం ఉంటుంది. ఆదర్శాలకు నిలయం కాలేకపోవచ్చు కానీ, నిత్య జీవన సంగ్రామం ఆ పాత్రల్లోనే ప్రతిఫలిస్తుంది. కొన్ని ఆదర్శాలనేవి ఒక పాత్రలో కూరి నిలబెడితే, అందులో జీవం ఎలా వస్తుంది? ఏదో కృత్రిమపు బొమ్మలా తయారవుతుంది ఆ పాత్ర

“పాత్ర పోషణ బాగుగానున్నది ఆ పాత్రలో బోలెడన్ని మంచి గుణాలున్నాయి” అని సామాన్య పాఠకుడు భావిస్తే భావించవచ్చు. కానీ, ఆ దశలో నువ్వు లేవని నమ్ముతున్నాను

నా ఉత్తరం నీ మనసుకి కష్టం కలిగిస్తుందని తెలిసే వ్రాస్తున్నాను. నా అభిప్రాయం గౌరవించనివాళ్ళకి నా అభిప్రాయాలు తెలియనివ్వను సాధారణంగా మరి నీ కెందుకు వ్రాస్తున్నానో నాకు తెలీదు.

ఉంటాను . .

..రావు.”

కన్నీటితో అక్షరాలన్నీ మసకబారిపోయి, కనిపించకుండా పోయే వరకూ, తనా ఉత్తరం పదే పదే చదువుతున్నానని కాని, చదువుతూ ఏడుస్తున్నానని కాని, సరళకు తెలియలేదు

ఉత్తరం మడిచి దీర్ఘంగా నిట్టూర్చింది. అవును–రావు వ్రాసిందంతా

నిజమే! ఇలాంటి విమర్శ ఉంటే కాని కొంత మంది రచన చెయ్య లేదు ఇది రావు తన నవమానించ టం కాదు, ప్రోత్సహించటం.

ఈ ఆలోచన ముందెందుకు లేక పోయింది? జీవితంలోని బోలు అనాల్ని బాగా అనుభవించాక కాని జీవితమంటే ఏమిటో తెలిసిరాలేదు ఒకనాడు రావు తనరచన విమర్శించి నందుకు కోపం తెచ్చుకుని మొత్తం జీవిత గమనాన్నే మార్చేసు కుంది ఈనాడు ఆ రావు విమర్శ ఎంతో అపురూపంగా అనిపిస్తోంది ఇంత సహే తుకంగా తన రచనను విమ ర్శించి తన అభివృద్ధికి పాటు పడేవాళ్ళెవరున్నారు? అయ్యో! ఈ జ్ఞానం మొదట్లో ఏమయింది? ఈ మాత్రపు ఇంగితం మొదటేఉంటే తను సరళా సుదర్శనం అయ్యేది కాదు

## 4

ఆఫీస్ నుంచి బయటకు వొచ్చిన రావు బస్‌స్టాండ్ దగ్గర సరళను చూసి ఆశ్చర్యపోయాడు

"సరళా! నువ్వు ఇక్కడ ..."

ఆగిపోయి నవ్వేశాడు రావు

ఎట్లాంటి సన్నివేశాన్నయినా అతి సామాన్యంగా నిర్వహించ గలగటం రావుకే తగును. అట్లాంటి సందర్భంలో ఎక్కువ ఆశ్చర్యం ప్రకటించకుండా నవ్వేయ గలగటం రావు లాంటి వ్యక్తులే చెయ్యగలరు.

"నీ ఉత్తరం అందింది నిన్ను చూడాలని వచ్చాను."

"తిట్టడానికి కాదు గదా!"

"నిన్ను తిట్టానా?"

> ఒకడు స్నేహితుడితో — "మా వాడొకడు చిన్న ఉద్యోగం చేస్తున్నాడు ఎంత చిన్న ఉద్యోగమంటే, వాడు ఎంత పెద్ద తప్పు చేసినా ఆఫీసుకు ఏ ఇబ్బంది కలగనంత చిన్న ఉద్యోగం"

"యూ, సిల్లీ! ప్రతినీ బరువుగా మార్చేయ్యకు, మోయ్యటం కష్టం. ఎందరెందరో పాఠకులు నిన్నభిమానించి ప్రశంసిస్తూంటే, నా బోటి సామాన్యుడు అంతగా విమర్శ చెయ్యటం"

"హాయిగా అనిపించింది. కనీసం ఒక్కరైనా నా రచనలు శ్రద్ధగా చదువుతున్నారని సంతృప్తి కలిగింది.

"వాట్?" కళ్ళు పెద్దవి చేసి చూశాడు రావు

"నువ్వు కాస్త ఎదిగావు సరళా!"

"కాస్త కాదు ముసలమ్మ నయిపోయాను పూర్తిగా. మా ఇంటికి రా! తీసికెళ్ళటానికే వచ్చాను."

"మీ ఇంటికా ?" ఆగిపోయాడు రావు.

"క్షమించు సరళా! నా కిష్టం లేకకాదు. కానీ నీజీవితంలో "

"మార్పుండదు. నా జీవితానికసలు మార్పు లేదు. అత్యంత వేగంతో కొండమీంచి అఖాతంలోకి ఉరికి అక్కడ స్థిరపడిపోయింది. రా! మా వారికి నిన్ను పరిచయం చేస్తాను. ఏ విధంగానూ, ఏ అపార్థాలూ రావని నమ్మకం కుదిరితేనే వెళ్ళు వద్దువుగాని ."

ఒక రకంగా అయిష్టంతోనే సరళ ననుసరించాడు రావు.

రావును సుదర్శనానికి పరిచయం చేసింది సరళ

"ఈయన నా రచనల్ని చక్కగా విమర్శిస్తారు. ఈ విమర్శల ద్వారా నేను ఇంకా వృద్ధిలోకి రాగలను. కొన్నాళ్ళు ఈయనా, నేనూ ఒకే ఆఫీసులో పని చేశాం !"

సుదర్శనం సంతోషంతో రావుతో కరచాలనం చేశాడు–ఆప్యాయంగా

కూర్చోబెట్టి కృష్ణవేణితో కాఫీ ఫల హారాలు తెప్పించాడు

"సరళ నా భార్య అయినందుకు నాకు చాలా గర్వంగా ఉందండీ. మనమూ ఉన్నాం—అతిసామాన్యంగా బ్రతుకుతున్నాం. ఈ "ఆర్ట్" ఏ కొద్ది మందిలోనో ఉంటుంది. మా సరళలో ఉంది. దానికన్నివిధాలా ప్రోత్సాహ మియ్యటమే నా సంకల్పం. మా సరళ ప్రతి రచనా ఒక అమృతపు గుళిక — ఇంకా ఇంకా వృద్ధిలోకి రావాలి."

తన మామూలు ఉపన్యాస మిచ్చేశాడు సుదర్శనం. చిరునవ్వుతో విన్నాడు రావు.

సుదర్శనం ఎప్పుడూ మాట్లాడే మాదిరిగానే మాట్లాడాడు — కానీ సుదర్శనం అలా మాట్లాడుతూంటే, ఎందుకో కుంచించుకు పోయింది సరళ. తనను తను వెక్కిరించు కున్నట్లని పించింది.

"ఇప్పుడే వస్తాను, మాట్లాడు కుంటూ ఉండండి" వెళ్ళిపోయాడు సుదర్శనం.

"గుడ్, సరళా! నువ్వు కోరి నట్లుగా నీ రచనా వ్యాసంగానికి ప్రోత్సాహ మిచ్చేవాడు, నిన్ను రచయిత్రిగా ఆరాధించేవాడూ నీకు భర్తగా దొరికాడు. బహుశః నీ జీవిత ధ్యేయం నెరవేరిం దనుకుం టాను."

సరళ తలెత్తి రావు ముఖంలోకి చూసింది ఆ కళ్ళలో ఈర్ష్యలేదు జాలి ఉంది.

అర్థమయిపోయింది. పది నిమి షాల పరిచయంలోనే రావుకు సమస్తమూ అర్థమయిపోయింది. అతని ఎదుట ఏడ్చెయ్యకుండా ఉండటానికి సమస్త శక్తులూ కూడ దీసుకుని ప్రయత్నించ సాగింది సరళ. రావు నిశిత దృష్టికి తన కళ్ళలో అంతరాంతరాలు కనిపించి పోతా యనే భయంతో వాల్చిన రెప్పలు పైకెత్తలేదు.

"నీ పాత్రలు కొన్ని బొమ్మల్లా ఉన్నాయని విమర్శించాను కదూ సరళా! చిత్రం! నిజ జీవితంలో మనుష్యులు కూడా కొందరూ బొమ్మల్లానే ఉండగలరు. వస్తాను సరళా! మళ్ళీ కలుస్తాను." వెళ్ళి పోయాడు రావు. ఏమీ మాట్లాడ లేకపోయింది సరళ. సరళ ఏమైనా మాట్లాడుతుందని రావు ఆశించనూ లేదు.

రావు వెళ్ళిపోయిన అరగంట వరకూ చైతన్య రహితంగా కూర్చుంది సరళ ఆ తరువాత కాగి తాలు దగ్గిరకు లాక్కుంది.

"అతనిది దృఢమైన వ్యక్తిత్వం. ఆమె చూపునందుకోగల నిశితమైన చూపు. ఆమె వాక్కు నెదుర్కోగల విజ్ఞతగల వాక్కు. ఆమె మనసు చదవగల నిపుణమైన మనసు ఆ దంపతులిద్దరు ఏమీ మాట్లాడ

కుండానె ఒకరికొకరర్థమయి పోతారు "

సాగిపోతూంది సరళ రచన

# 5

"అదే, వీల్లేదు "

"ఎందుకు వీల్లేదేమిటి ?"

"నా యిష్టం"

"నీ యిష్టం నీ ఇంటిదగ్గర "



"ఇదీ, నా ఇల్లే !"

"పోవోయ్ ! నా ఇల్లు !"

"అయితే నా ఇల్లు కాదన్న మాట !"

"ఎంతమాత్రం కాదు నువ్వు నా కాళ్ళమీదపడి ప్రాధేయపడితే, కాస్త స్థానమిస్తాను "

"సరే ! రేప్పొద్దున వంట మానేసి నీ కాళ్ళమీదపడి ప్రాధేయపడుతూ కూర్చుంటాను వంట నువ్వు చూసుకో !"

"చంపేశావ్ ! వంటమాత్రం మానకు నాకు హొటల్లో సయించదు. ఏం చేస్తాను ? నీ ఇల్లేలే !"

"అలా రా, దార్లోకి !"

"దార్లోనే వున్నాను. నువ్వే దారి తప్పిస్తున్నావ్ !"

"నీ మొఖం, గుడ్డివాడివి నువ్వు. చెయ్యిపట్టుకొని నడిపిస్తున్నా నేను."

"నేను గుడ్డివాణ్ణా? నా కళ్ళు చూడు !"

కృష్ణవేణి సుదర్శనం కళ్ళలో కళ్ళుపెట్టి చూసింది

"అందంగా వున్నాయి. కానీ, చూపు లేందే?"

పకపక నవ్వింది.

"గుడ్డిదాన్ని నేను" అకస్మాత్తుగా అక్కడికొచ్చిన సరళ అంది.

కృష్ణవేణి, సుదర్శనం ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు.

"అదేమిటి సరళా, మా గోలతో

"నిన్ను డిస్టర్బ్ చేస్తున్నామా? చద రంగం ఆడుతూ వాదించుకుంటున్నాం. మాబోటివాళ్ళకింతకంటే చేసేదేముంది? పద కృష్ణా! అవతలిగదిలోకి పద. మన గోలతో సరళ వ్రాత పాడయిపోతోంది."

గబగబ పావులు సర్దేసి చదరంగం బల్లతో సహా అవతలికి పరుగెట్టింది కృష్ణవేణి.

"సారీ సరళా! అవతలి గదిలోకి పోతున్నాంలే! నువ్వు హాయిగా వ్రాసుకో."

"రాత!" నుదురు పట్టుకుంది సరళ.

ఎప్పటికో చదరంగం పూర్తయి భర్త తన దగ్గరకొచ్చాక అడిగేసింది.

"కృష్ణవేణి మీరు చాలా సరదాగా వుంటారే?"

హుషారుగా నవ్వాడు సుదర్శనం.

"అసలు పసకు మరద లవుతుందిగమా! అందుకని అల్లరి చేస్తుంటాను. నువ్వేమీ అనుకోవని తెలుసు నాకు. అదే ధైర్యం. నీ రచనల్లో అందరివీ ఎంత విశాల హృదయాలు! నీ స్త్రీ పాత్ర లందరూ ఎంతటి సహనమూర్తులు! భర్త ప్రత్యక్షంగా మరో స్త్రీతో ఉంటూంటే కూడా సహించి అతనినే ఆరాధించిన స్త్రీ పాత్రలను సృష్టించిన రచయిత్రివి నువ్వు. సంకుచితత్వంతో కాస్త సరదాగా ఉన్నంతమాత్రాన అపార్థం చేసుకుని కలతలు రేపిన వ్యక్తుల్ని ఘాటుగా విమర్శించిన రచయిత్రివి. కృష్ణతో నా చనువును అపార్థం చేసుకోవని నాకు తెలుసు."

"కాదు - కాదు! అపార్థం చేసుకోవటం కాదు." సరళగొంతు పూడుకుపోతోంది. పెగల్చుకుని, ఆవేశాన్ని చంపుకొని అడిగింది.

"ఆవిడతో మాట్లాడినంత సరదాగా నాతో ఎప్పుడూ మాట్లాడరేం?"

"సరదాగా మాట్లాడానా?" నిజంగా ఆశ్చర్యపోయాడు సుదర్శనం.

"నాకు తెలీదు. కృష్ణతో మాట్లాడేటప్పుడు నేనేం మాట్లాడుతున్నానో నాకు తెలీదు. కృష్ణ తెలివితక్కువది. దానితో ఎలా మాట్లాడినా పరవాలేదు. అందుకే నోటికొచ్చినట్లు మాట్లాడతాను. నువ్వు చాలా తెలివైనదానివి. అందుకని నీతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా ఆలోచించి మాట్లాడతాను."

బెదురుగా సరళవంక చూశాడు సుదర్శనం.

గిరున తిరిగి వెళ్ళిపోయింది సరళ.

సరళకు కోపం వచ్చిందనుకున్నాడు సుదర్శనం.

రాత్రి భోజనా లయ్యాక సరళను సమీపించాడు.

"నిన్ను కష్టపెడితే, నన్ను

క్షమించు సరళా!" దీనంగా అన్నాడు.

సరళ కరిగిపోయింది.

"ఛ! కష్టమేమీ లేదు సరదాగా మాట్లాడకూడదా, అన్నాను అంతే!"

"నువ్వు స్తిమితంగా కూర్చొని ఆలోచించి రాస్తావు గనుక నీ పాత్రలంతా అంత చక్కగా మాట్లాడతారు అప్పటికప్పుడు తోచింది మాట్లాడతాను నేను. నీ పాత్రలలా ఎలా మాట్లాడతాను? పోనీ, ఏం మాట్లాడాలో వ్రాసియ్యి చదువుకుని అలా మాట్లాడతాను"

పకపక నవ్వింది సరళ

సరళ నవ్వుతో బెంగ తీరిపోయింది సుదర్శనానికి.

హాయిగా పడుకోబోయాడు.

"చూడండి. ఈ చీర బాగుందా?"

తను కట్టుకున్న తెల్ల జరిచీర చూపిస్తూ అడిగింది

"చాలా బాగుంది"

"పువ్వులు ?"

"అవీ బాగున్నాయి బాగుండనివి నువ్వు పెట్టుకోవుగా!"

"ఈ రాత్రేం?"

అయోమయంగా చూశాడు సుదర్శనం నవ్వింది సరళ

"నిద్రొస్తోందా?"

"అవును"

రగ్గు కప్పుకోబోయాడు

"నాకూ నిద్రొస్తోంది. ఏం వ్రాయాలని లేదు."

"అరె! నిద్రొస్తోందా? ఉండు. కృష్ణను టీ పెట్టమని చెపుతాను. కృష్ణా ..." గాభరాగా వంటింట్లోకి పరుగెట్టాడు సుదర్శనం.

తల్లో పూలు తీసి నేలమీదకు విసిరికొట్టి కలం చేతుల్లోకి తీసుకుంది సరళ.

ప్లాస్కుతో తనను సమీపించిన భర్తను జాలిగా చూసింది.

"చేతులు నొప్పెడుతున్నాయండీ!"

"నిజంగా! ఆయింట్‌మెంట్ రాస్తానుండు. పోనీ కాస్సేపు నువ్వు చెప్పు - నేను వ్రాస్తాను."

"ఏం వద్దు. పడుకోండి."

"గుడ్‌నైట్!"

ముసుగు బిగించేశాడు సుదర్శనం.

నేలరాలిన పూలను చూస్తూ కలం నడిపింది సరళ.

# 6

"సరళా! నిన్ను చూడ్డానికి వాళ్ళందరూ వచ్చారు" సంభ్రమంగా చెప్పాడు సుదర్శనం. హాడిలిపోయిందు సరళ. వాళ్ళంతా అంటే సుదర్శనం స్నేహితులు రోజుకో గుంపును నా స్నేహితులంటూ తీసుకొచ్చి "నాభార్య సరళ ప్రఖ్యాత రచయిత్రి" అని పరిచయం చేస్తాడు సుదర్శనం. ఇంక వాళ్ళే వేవో మాట్లాడతారు - ఎదో చూడటానికి రావటమేతప్ప వాళ్ళలో చాలామంది అసలు తన రచనలు పూర్తిగా చదివి ఉండరు.

"ప్రస్తుతం మన దేశ పరిస్థితులను గురించి మీ అభిప్రాయమేమిటీ?"

"ఈసారి కాంగ్రెసు గెలుస్తుందంటారా?"

"కాంగ్రెసు గెలిస్తే మంచిదా? గెలవకపోతే మంచిదా?"

"ఈ ఆహార సమస్య, నిరుద్యోగ సమస్య - వీటికన్నింటికీ మూలమేమిటి?"

"ప్రస్తుతం యుద్ధం లేకపోయినా పాకిస్తాన్ మనకు పక్కలో బల్లెమే, ఏమంటారు?"

"చైనా యుద్ధంలో మన ఓటమికి కారకు లెవరంటారు? ది అన్‌టోల్డ్ స్టోరీ గురించి మీ అభిప్రాయమేమిటి?"

"ప్రస్తుతం ఎక్కడ చూచినా కరప్షన్ కనిపిస్తోంది. కారణం ఏమిటంటారు? అజ్ఞానమా? అశ్రద్ధా? ఆకలా? దీన్ని నివారించటానికేం చెయ్యాలి మనం?"

"రూపాయి విలువతగ్గింపులో మన ప్రధానోద్దేశం మన దేశ వ్యాపారా

# ఏ ఊరు ఎవరిదో చెప్పండి!

అనగనగా ఒక వూరు అ వూరికి ఒకనాడు ముగ్గురు పరదేశీలు వచ్చారు. ముగ్గురూ ఒకే పేదరాసి పెద్దమ్మ ఇంట్లో బసచేశారు. ఆ రాత్రి భోజనాలైనాక, ముగ్గురూ అరుగుమీదచేరి లోకాభి రామాయణం మొదలుపెట్టారు. ఒకరి పేరు ఒకరు అడిగి తెలుసుకున్నారు. ఒకరి వూరు ఒకరు అడిగి తెలుసుకున్నారు.

ఒకాయనపేరు రామయ్య. ఇంకొకాయన పేరు కృష్ణమూర్తి. మూడో ఆయన పేరు వెంకటయ్య.

వాళ్ళ వూళ్ళ పేర్లు రామాపురం, కృష్ణానగరం, వెంకటాయ పాలెం.

ఈ సంగతులు తెలిశాక కృష్ణానగరం నుంచి వచ్చిన పరదేశీ ఇలా అన్నాడు: "చూశారా ఈ విచిత్రం? మన పేర్లకు, మన వూళ్ళ పేర్లకు సరిపోయింది. కాని, ఏ పేరుగల మనిషి ఆ పేరుగల వూరినుంచి రాలేదు."

"అవును సుమండీ. విచిత్రమే!" అన్నాడు రామయ్య.

ఆ ముగ్గురిలో ఎవరు ఏ వూరి వారో చెప్పకోండి.

[ జవాబు 80 వ పేజీలో చూడండి ]

న్నధికం చెయ్యటం.ఈ ఉద్దేశం ఎంత వరకు నెరవేరిందంటారు?"

పాపం సరళకు కన్నీళ్ళు తిరిగి పోతుంటాయి. ఏదో మూలకూర్చుని ఏదో అల్లుకుని కథలు వ్రాయటం చేతనవును కాని దేశ పరిస్థితులను గురించి తనకేం తెలుసు? ఈ రచనా వ్యాసంగంలో పడి తీరికలేక పేపరు చూట్టం కూడా పడటంలేదు. ఏదో స్థూలంగా కొన్ని విషయాలు తెలుసు వివరాలేమీ తెలియవు తెలియటానికి ఆలోచించిం చెప్పడూ? తెలుసుకోవాలని ప్రయత్నించిం దెప్పుడూ? "ఏ అన్‌టోల్డ్ స్టోరీ" అనే పుస్తకం వచ్చినట్లే తనకు తెలీదు. ఇంక దాన్ని గురించి తన అభిప్రాయం ఎలా చెప్పగలదు? ఎప్పుడూ వ్రాసుకోవటంలో మునిగిపోయి కొత్తగా వచ్చిన తెనుగు నవలలే చదవటంలేదు. ఇంగ్లీష్ పుస్తకాలు కూడా ఎక్కడ చదవగలదు?

[సశేషం]

# తీర్పు

## — బీనాదేవి

నువ్వు నా దగ్గరికి రాక ముందెక్కడికీ వెళ్ళలేదా? గుడ్. మంచిదే! ఏడు మనుముల ఎరకల్లాంటి వాణ్ని. నాకు బార్లో ముప్ఫై ఏళ్ళు పూర్తయి ఎన్నేళ్ళయ్యాయో చెప్పడానికి నే నిష్టపడను. కష్టపడి కట్టలు మోస్తే ఎప్పటికైనా మేత్త్రీ ప్లీడరు వవుతావు. తొందర పురోభివృద్ధికి శత్రువు. కేస్ "లా" బాగా చదువు. ఒక లా పాయింటు గురించి ఒక హైకోర్టు ఓలా అంటే, మరోటి మరోలా అంటుంది. పెళ్ళాం పిల్లల్ని కనాలా? వద్దా? అనడిగితే, కనాలని ఒక హైకోర్టంటుంది. కనఖ్ఖర లేదని మరోటంటుంది చేతనైతే మొగుణ్ణే కనమని మూడోదంటుంది.

నా చిన్నప్పుడొకడు బోలెడాస్తి తగలబెట్టేకుండా చచ్చేడు. ఆ ఆస్తి నాదంది వాడి కూతురు. అంతే తనదంది. కాదన్నాడు వాడి తమ్ముడు. ఎం అంటే అది వాడి కూతురు కాదు కాక పోయినా దానమ్మ దాన్నన్నని పెళ్ళాడలేదని మొండికెత్తేడు. బ్రతికున్నది చచ్చినా వాడి కూతురా? కాదా? అన్న పాయింటు మీద ముప్ఫై మంది సాక్షుల్ని విచారించి, ముత్తుస్వామయ్యరు అర్గుమెంట్ విని, కూతురే అంది మొదటికోర్టు. అపీలెళ్తే కాదన్నారో హైకోర్టు సింగిల్ జడ్జి మళ్ళీ అపీలెళ్తే ఔనన్నారిద్దరు జడ్జీలు.

అలా అని ఊరుకోకుండా, దీనమ్మకి మొగుళ్లో ఇంకెవరితోనైనా పెళ్ళయిందా లేదా అన్న పాయింటెవరూ చూళ్ళేదనీ, ఆ పాయింటు విచారించమని కింది కోర్టుకి రిమైండ్ చేశారు. కిందికోర్టు మరో పదిమందిని విచారించి పెళ్ళయిందంది దానిమీద అపీలెళ్తే దానమ్మకి అదివరకు పెళ్ళవలేదనే అన్నారు మా క్లయింటు గెల్చుకుంది. కాని ఈ లోగా ఉట్టి ముసిలిదై పోయింది. మూళ్ళక్ష

లాసికి మూణ్ణాలపరక మిగల్లేదు. దాని మొహం నేనుచూడలేకపోయే వాణ్ణి. కాని అదిమాత్రం వారానికో అప్పడాలకట్ట ఇచ్చిపోయేది. ఆఖరికి అప్పడాలమ్ముకొనే బతికిందిలే.

ఇంకా సీనియర్ దగరకెళ్ళినా ఇలాంటి పాతకాలం సలహా లివ్వ వచ్చు. నువ్వు పట్టా పుచ్చుకొని పనికి రావాలనుకుంటే ఎలాగా పుస్తకాల పురుగు వవుతావు. కష్టపడతావు ముందుకొస్తావు. నాకు సందేహం లేదు. ఇవన్నీ తుప్పట్టిన కబుర్లే.

నీకు తెలీందీ, నీకెవ్వరూచెప్పందీ మాత్రం ఒకటుంది. జడ్జీ మనస్తత్వం బట్టిపోవడం నేర్చుకోవాలి. దుర్యోధను డేఆయుధం తీస్తాడో ధర్మజుడికి ముందే తెలిసుండొచ్చు.

కాని జడ్జీ ఎప్పుడు ఏ అడ్డు పెడతాడో ముందుగా నీకు తెలీదు. చాలాసార్లు ఆతగాడికే తెలీదు.

"కాని మీవాడు పెళ్ళాన్నొదిలేశాడు. ఎలా నమ్మమంటావ్, వాడి సాక్ష్యంకి?" అని నీ కాళ్ళల్లో కర్ర పెడతాడు. నీ కళ్ళల్లో కారం కొడతాడు. అంతవరకూ నీది స్ట్రాంగ్ కేస్ అనుకున్ననువ్వు నెత్తినగుడ్డేసుకోవాల్సిందే నీ క్లయింటు అనుకున్న ధరకి బంగాళా దుంపలు కొంటాననా, అవతలివాడు అమ్మకపోవడానికీ, మీవాడు భార్య నొదిలెయ్యడానికీ గల సంబంధం నీకు తెలీదు. అట్టేమాట్లాడితే జడ్జీకే తెలీదు.

కాని నువ్వలా అనేవు. ఆ సంగతి నీకంటే జడ్జీకి బాగా తెలుసు.

నీ కేసు పోతుంది. నీకు నీరసం వస్తుంది. నువ్వు క్లబ్బునుంచి ఆలస్యంగా వెళ్ళడానికీ, అన్నం చల్లారిపోడానికీ సంబంధం నీకు తెలీదు. నీ పెళ్ళాన్నడుగుతావు. ఆవిడ చెబుతుంది. నిజం చెప్పినందుకు నువ్వు కోంబడతావు. అడిగేవాడికి చెప్పేవాడు లోకువ నీ పెళ్ళాం నీకు లోకువ. నువ్వు జడ్జీకి లోకువ.

ఇలా అంటున్నానని జడ్జీలకి మూడు చేతులూ, ముప్పై కాళ్ళూ, కొండజెర్రిలా ఉంటాయనుకోకు. వాళ్ళంతా నీలాంట్నాలాంటివాళ్ళే. చాలా మంది నాకంటె మంచివాళ్ళు కూడా.

"వాళ్ళకి చెవులుంటాయే కాని కళ్ళుండవు. బుర్రుంటుంది కాని బుద్ధుండదు. గుండె ఉంటుంది కాని దయుండదు" అని అన్నా అనే మాటలు నేను అనను.

కాని నేననేది మాత్రం ఒకటే. వాళ్ళకి చాలా మామూలు విషయాలు అర్థం కావు. దానికి కారణం వాళ్ళు కాకపోవచ్చు. పుట్టుకతో వచ్చిన గుణాలు మనం ఏం చేసినా పోవు. కాని, నా ఏడుపల్లా వీళ్ళు దేవుడిచ్చిన అజ్ఞానం వృద్ధి చేసుకుంటున్నారనే దెబ్బలాడుకుంటున్నా. చాలామంది మొగుడూ పెళ్ళాలు కలిసే వుంటారనీ, పాత బాకీ ఎగ్గొట్టేసినా ఖాతాదారుకి



మళ్ళీ అగుపిస్తారనీ, ఒక తాగుబోతు మంచి భర్తకావచ్చనీ వగైరా విషయాలు వీళ్ళకి తెలియవు.

జీవితంలో ఢక్కా మొక్కీలు తినవలసిన టైముకి వీళ్ళు మునసబులూ, మేస్త్రీల్లూ అయి అరుగెక్కి కూర్చుంటారు. అక్కణ్ణుంచి చూస్తే మామూలు మనుషులు పురుగుల్లా కనిపిస్తారు. వెనకటికో జడ్జీగారిమీద అతని

విధవాదిన మనోవర్తి డిక్రీ పొందించిటు. దాంతో మనోవర్తి మనిషెవరైనా అతగాడి కోర్టుకొస్తే మండిపడిపోయేవాడు. మరో కోర్టువారిని వారి అన్న మోసం చేసేటు. దాంతో అతగాడు దావా చేసిన ప్రతి తమ్ముణ్ని తోబుట్టువుగా చూసుకునేవాడు.

అంచేత నేను చెప్పేదేమిటంటే నా పార్టీ అదృష్టం ఒకొక్కప్పుడు జడ్జిగారి జీవిత విశేషాలమీద ఆధారపడి వుంటుంది. ఉరుములూ, పిడుగులూలా సాక్ష్యముంటే ఏ చచ్చు ప్లీడరన్నా గెలుచుకుంటాడు. నీ క్లయింటు కేసు నిజమై, కోర్టుకు కావల్సిన అబద్ధ సాక్ష్యం వాడు తేలేనప్పుడే నీకు కష్టం.

* * *

చాలాకాలం క్రిందట తను బార్‌లో కాలు పెట్టినప్పుడు తన సీనియర్ లాయరు తన కిచ్చిన ఆ సలహా ఎందుకో సుదర్శనానికి అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చింది.

రాత్రి పది గంటలు కొట్టి ఎంతసేపైందో వకీలు సుదర్శనానికి, అతని కెదురుగా వున్న కనకారావుకీ తెలీదు

కనకారావు పెద్దలిచ్చిన ఆస్తికి పెద్దపెట్టున బిజినెస్ కలిపేడు. పెద్దలు కుదిర్చిన పెళ్ళానికి అన్ అఫీషియల్‌గా తోడు తెచ్చుకున్నాడు. అతను ఎలక్షన్‌కి నిలబడితే ఓట్లు టపటప రాల్తాయి. అతను కన్నెర్ర చేస్తే కొక్కిరాయి లీడర్లు కాలిపోతారు. అతను కంపెనీ పెడదామనుకుందేలోగానే చుట్టూ చేతులు చాపుతాయి డబ్బుపట్టుకొని. ఊళ్ళో ఎవరు ముందుకు రావాలో, ఎవరు వెనక్కి పోవాలో నిశ్చయించేదతనే. కాని అదంతా రెండు నెల్ల క్రిందటి వరకే. ఈ రెండు నెలల్లో ...

"ఆ కుక్క వెధవ సత్తిగాడు" అని కనకారావు తిట్టే సత్యనారాయణ ఎదురు తిరిగేడు. సత్యనారాయణ గడ్డుదశలో ఉండగా కనకారావు పోదిగి పిల్లని చేస్తే, వాడే ఇప్పుడు గండభేరుండమై పీక పట్టుకున్నాడు సత్యనారాయణ కనకారావుకి తలా, నాలిక, కుడి భుజమే కాకుండా శకునిగా ఉండేవాడు. "ఇప్పుడేంలాభం? శనిగా తయారయ్యేడు. ఆ గాడిద రాజుగాడి పార్టీలో చేరిపోయాడు.

"నన్నొగ్గేశాకన్న ఇశారం లేదు కానీ ఆ ఎదవగాడితో సెయ్యి కలిపేడంటేనే నాకు గుండె మండిపోద్ది. నువ్వు సిన్నోడివి సుదర్శనం బాబూ! నా నెప్పుతా సినుకో నువ్వు వెస్ట్రీకు కోరటు వరండాల్లో యీదికుక్కలా కూకున్న రోజుల్లో నిన్ను పైకి తీసింది నాను. నాను పోయేక అంతో దివి కావాలనుకునేవోణ్ని. ఏం నాబం? ఆ గుడ్డిసత్తిగాడు నీ కంచంలో కాలెట్టేడు. ఆడి పెల్లానికి జబ్బుసేస్తే ఏలకి ఏలు కరుసు సేసింది నాను. ఆ ఎదవ

తమ్ముడికి ఎంబిబియస్సుకి డొనేసను కట్టింది నాను ఆడి మిల్లుకీ, సినిమా హా కీ లైసెన్సులు తెచ్చిందినాను ఆడి అప్ప మొగుణ్ణి సంపిం చేస్తే, కేసు కామాపు చేయించింది నాను

కన్నకొడుకుని సూసు కున్నట్లు సూసుకున్నాను ఏట్నాబం! ఎనక దెబ్బ కొట్టేసేడు ఆడు సైర్మెన వతానంటే నాను కాదం టూనా? ఆ కుర్చీలో నానే కూకుంద బెట్టేవోణ్ణి కానా ఎదవ ఆడి గవురవం నిలబెట్టుకోనేడు నన్ను నిల బెట్టుకోనీనేడు

"ఇద్దరు హాలీవుడ్ తారల మధ్య సంభాషణ – "నేను పెళ్ళి చేసుకో బోతున్నాను"

"ఎవరి భర్తని?"

*     *     *

కొత్తగా వెలువడిన ఒక పుస్తకంపై ఒక పత్రికలో సమీక్ష – "ఇది అంత తేలికగా తీసివేయదగిన పుస్తకంకాదు బలమంతా ఉపయోగించి గిరాటెయ్యాలి"

ఇపుడెంతేడిసి ఏట్నాబం? నేను మాటాణ్ణు ఆసల్నాకు మాట్లంటే అసయ్యం నాక్కావలసింది పని నువ్వు తపస్సే సేస్తావో, తన్నతే తింటావో నాకు తెల్దు కాన్నా కేసు నిలబెట్టు ఆడికాడ మూడువేలూ పుచ్చుకున్నమాట్నిజం ప్రోనోట్రూ సినమాటుకూడా కాదన్ను ఆడికేదో అవసరమొస్తే తిరిగిచ్చేసేను వడ్డీ ఆడడగా నేదు నానివ్వానేదు మాకూ మాకూ వడ్డీ లెప్పుడూ లేవు

డబ్బిచ్చినప్పుడు నాను ప్రోనోటు కూడా అడగనేదు. అప్పుడాడే "నా పెళ్ళాం గుళ్ళో కెళ్ళినాది. తాళాలు దానికాడుండిపోనాయి. అది రాగానే ప్రోనోటు అంపించేస్తా నన్నాడు. కాని ఆడు పంపించా నేదు నానడగానేదు అప్పటి కాడికా దురుద్దేశం ఉందనికూడా అనుకోను నాను డబ్బిచ్చినప్పుడు ఆడూ, నేనూ, ఆడి కుక్కా తప్ప మరెవరూ నేరు ఆడి కుక్కకి మాటొస్తే ఆడికంటె నిజం సాచ్చికం కోర్టులో జెప్తాది సూడు సుదరసన బాబూ! నాను డబ్బిచ్చేసినమాట నీకు తెల్సు, నాకు తెల్సు, ఊరందరికీ తెల్సు కాని కోరటువారికి తెల్దు

కాబట్టి ఏటి సేస్తావో సెయ్యి వందే కావాలో, వెయ్యే కావాలో నన్నడుగు, నానిస్తాను గాని ఆ ఎదవ తెచ్చిన ప్రోనోటు కేసు కొట్టించి అది సెతగాపోతే ఆణ్ణి

షుంపించి. నీ పెళ్లాం పిల్లల భారం నాది' అంటూ లేచి పోయాడు కనకారావు. అతను వెళ్ళిపోయేక సుదర్శనం ఆలోచన రంగాచారి మీదికి వెళ్ళింది.

*　*　*

రంగాచారి ఇద్దరందమైన ఆడ పిల్లలకి అందమైన తండ్రి. ఇద్దరు మంచి కొడుకులకి అతి మంచినాన్న. ఒక పతివ్రతకి పుణ్యమూర్తయిన భర్త. దేశానికి బాధ్యతగల పౌరుడు. ఆ ఊరికి కోర్టు మునసబు. అతనెప్పుడూ సిగరెట్టు కాల్చలేదు. పరస్త్రీని ప్రేమించలేదు. దొంగతనం చెయ్యలేదు. దొంగని వదిలెయ్య లేదు. అతనికి దేవునిపట్ల కృతజ్ఞతే గాని కావేషీ లేదు.

దేవుడున్నాడా? ఉంటే అంత కంటె దుర్మార్గుడెవడైనా వున్నాడా? వగైరా ప్రశ్న లతన్ని బాధించలేదు. దేవుడు మంచివాడు. పూర్వజన్మనీ, పునర్జన్మనీ శంకించిన వాడికి పుట్టగతుల్లేకుండా పోతాయి. ఈ జన్మ పూజల పంటే వచ్చేజన్మ. మనుషులు మంచివాళ్ళూ చెడ్డ వాళ్ళూ అని రెండే రెండు రకాలు. నిన్నటి కాటుగాడు నేటి ఖూనీ కోరు. ఈవేళ బడికెళ్ళని పిల్లడు తర్వాత జైలుకెళ్ళక మానడు. మంచితనానికి మలేరియా లాగా డిగ్రీలుండవు. చెడ్డ తనానికి నిచ్చెనమెట్లుండవు. చెడ్డతనం అవిభాజ్యం. ఒక విష యంలో నీతి తప్పినవాడు మరో విషయంలో దారి తప్పడనేవిటి గ్యారంటీ? ఇవి, రంగాచారి నమ్మ కాలు.

*　*　*

కేసు విచారణ పూర్తయింది. కనకారావు ఎంత బలవంతం చేసినా సుదర్శనం సత్యనారాయణని "నీ అప్పని అక్రినాణి'అంటూరా లేదా?' అని అడగలేదు. కనకారావూ, సత్యనారాయణా యిద్దరే సాక్షులు. బాకీ తీర్చేసనని కనకారావు సాక్ష్యం. ఇవ్వలేదని సత్యనారా యణ ప్రమాణం. కాని తనకీ, కనకారావుకీ మధ్య మంచి నమ్మకం

వుండేదనీ, కనకారావు యిదివరకు శివ దగ్గర బదులు పుచ్చుకొని తీర్చేసిన ప్రోనోట్లు తనవద్దే వదిలేసేదనీ కనకారావుకి డబ్బు లక్ష్యం లేదనీ సత్యనారాయణ వొప్పుకున్నాడు.

కాని సుదర్శనానికి మాత్రం సంతోషం కలగలేదు. కనకారావు తను భార్యతో కాపురంచేస్తున్నా, రంగమణిని చేరదీసేననీ, యిద్దరికల్లా పిల్లలున్నారనీ వప్పేసుకున్నాడు.

"భార్యవుండగా పరస్త్రీని కన్నెత్తి చూడడం పాపం."

"చూసేక చెయ్యి వెయ్యడం పాతకం."

"కాలుజారి సంబంధం ఏర్పడితే భార్యను పుట్టింటికి పంపించెయ్యక పోవడం అమానుషం."

"పెళ్ళాం పీకలమీద ఉంపుడు కత్తెఅనే కత్తిని శాశ్వతంగా కొయ్యకుండా పెట్టిన పెద్దమనిషి, ఎగస్ట్రీ పార్టీలో కలిసిపోయిన తన ఎక్స్ అసిస్టెంట్ పీక ఎందుకొయ్యడు? ఈ ప్రశ్నలు మునసబుగారు వెయ్యరు. ఆర్గుమెంటులో కూడా అవతలి వకీలు రామారావు వెయ్యడు. వేస్తేనే నయం. వెర్రో మొర్రో జవాబులు చెప్పుకోవచ్చు. వెయ్యని ప్రశ్నలు వేసిన ప్రశ్నల కంటె ప్రమాదకరం. అని సుదర్శనం అనుకుంటుండగా, కేసు మర్నాటికి ఆర్గుమెంటుకి వాయిదా పడటం, రంగాచారి మేనత్త కొడుక్కి అర్జంటుగా ఆపరేషను అని టెలిగ్రాం రావడంచేత అతను విశాఖపట్నం వెళ్ళిపోవడం జరిగిపోయాయి.

ఆపరేషను సక్సెస్‌ఫుల్. పేషెంటు కూడా బతికేడు. మూడో నాటి మధ్యాహ్నం నిద్ర లేచేసరికి రంగాచారికి, నరాలు ముడులు విడిపోయినట్టూ, యిన్నాళ్లూ ఎముకలు దొలిచిన పురుగులు చచ్చిపోయినట్టూ, హాయిగా బద్ధకంగా, విలాసంగ మనస్సు స్నానం చేసినట్టుంది. హోటల్ గదిలో వాలు కుర్చీలో కూర్చున్నాడు రంగాచారి. గదిలో ట్రాన్స్‌పరెంటు ప్లాస్టిక్ కర్టెన్ వెనక బంగారు బల్బు పెట్టినట్టు సాయంత్రపు ఎండ పడుతోంది.

సిలింగు ఫ్యాను ప్రౌఢ స్త్రీ కదలికలలా అస్పష్టకర మైనంత మెల్లిగా తిరుగుతోంది.

ఈ లోగా అడుగుల సవ్వడి.

కిటికీలో ఆశలకొసని పూసిన పువ్వులా ఒక స్త్రీ మొహం కనిపించి మాయమైంది.

తర్వాత ప్లాస్టిక్ కర్టెన్ కింద గుండెని రేకెత్తించే ఎర్రరంగు పట్టు చీర క్రింద గులాబీరంగు ఆడ పాదం, ఎర్ర వెల్వెట్ దిళ్ళ మీద వుండవలసిన పాదం.

రంగాచారి హృదయంలో రోజాలు వికసించేయి.

పాదం కదలికకు లయవేసినట్టు గాజుల చప్పుడు.

రంగాచారి హృదయంలో

సన్నగా వెయ్యి గిటార్లు ఒక్కసారి మ్రోగేయి.

పాదం మాయమైంది.

పక్క తలుపు తెరిచిన ధ్వనికి హృదయకవాటం ఓరగిల వాలింది.

'నువ్వొక్క వారం కూర్చుంటే నేనొక్కర్తెనూ యీ హోటల్లో వుండలేనన్నట్టు.'

పాదానికి ముప్ఫైఏళ్ళుండొచ్చు. కాని మాటకి ముచ్చటగా మూడే. ముద్దొస్తోంది.

"నువ్వెళ్ళొద్దు బాబూ."

"మరేం ఫర్వాలేదు. ఈ వారం రోజులూ పక్క రూముల వాళ్ళు ఆ మాత్రం సాయం చేసి పెడతార్లే." ఒక మొగకంఠం ధైర్యం చెబుతోంది. తర్వాత ఆ కంఠం ఓనరువెళ్ళిపోయిన పాదాలచప్పుడు.

* * *

రాత్రి పది.

పక్క గదిలో పాదాల అలికిడి విని రంగాచారి చదువుతున్న పుస్తకం పక్కన పెట్టేశాడు.

పక్క గదిలో భళ్ళున కూజా పగిలిన ధ్వని.

"గుడ్ గాడ్! పాదాలు వేగలేదు కదా!"

"లేదు" అన్నట్టు ఆ స్త్రీ గదిలోకి వచ్చేసింది.

"కాసిని మంచినీళ్ళిస్తారూ?" బిస్మిల్లాఖాను ఆ గొంతునుంచి చాలా నేర్చుకోవలసివుంది.

"అవశ్యం, కూర్చోండి."

ఆమె కూర్చుంది రంగాచారిచ్చిన మంచినీళ్ళు జిన్ లా రుచి చూసి గ్లాసు పక్కకి పెట్టేసి "పుస్తకాలేమైనా వున్నాయా?" అనడిగింది.

పుస్తకాలున్నాయి.

చంద్రముఖితో సయ్యాటలాడుతున్నట్టు, హోటేలు చెట్లలో దాగివున్న రంగు నక్షత్రాల్లా మిలమిల్లాడుతున్న డెకరేషన్ బల్బులూ ఉన్నాయి.

హోటలు కిటికీలోంచి ఆమె మొహాన్ని తొంగిచూసి, అలంకరించుకున్న పెళ్ళికూతురు అనుకోకుండా అద్దంలో చూసుకున్నప్పుడు సిగ్గుపడ్డట్టు బిడియపడి, మబ్బుతెర కప్పుకొన్న చంద్రుడూ వున్నాడు.

నీలి సముద్రం మీచి వచ్చిన చల్లగాలీ వుంది.

రంగాచారికి పరస్త్రీతో రాత్రిపూట ఒంటరిగా గదిలో వుండడం అది రెండోసారి. మొదటిసారి అతనితోవున్న ఆవిడ రిటైర్డు లేడీ డాక్టరు. అప్పుడతనికి నూట రెండు జ్వరం కూడా.

నిజం చెప్పాలంటే యిప్పుడూ నూటారు జ్వరం వచ్చినట్టుందతనికి.

మంచినీళ్ళకొచ్చినామె మర్నాడు ఉదయం కాఫీ తాగి మరీ వెళ్ళింది. ముచ్చటగా మూడ్రోజులు గడిచిపోయేయి.

* * *

"కానికనకారావు భార్యకన్యాయం చేశాడు" అని కనకారావు భార్యకంటె ఎమోషనల్‌గా ఆర్గ్యూ చేశాడు అవతలి వకీలు రామారావు.

"చూడండి మిస్టర్ రామారావ్! ఈ దావా మిసెస్ కనకారావు చెయ్యలేదు. కనకారావు మీ పార్టీకి మూడువేలూ తిరిగిచ్చేశాడా లేదా అన్నదొకటే ఇందులో పాయింట్" అన్నారు మునసబుగారు.

"తిరిగిఇచ్చేశా" డన్నారు ఆ తరువాత తీర్పులో.

***

### కొసమెరుపు కథలు కొల్లలుగా వ్రాసి, "ఓహో!" అనుపించుకున్న



# ఓ హెన్రీ

ఒక గొప్ప రచయిత దగ్గరికి ఒక చిన్న రచయిత వెళ్లాడు. "అయ్యా రెండు కథలు చదివి వినిపిస్తానండీ, తమ అమూల్యమైన అభిప్రాయాలు చెప్పాలి" అన్నాడు.

'సరే–' అన్నాడు గొప్ప రచయిత; వినడానికి సద్దుకుని కూర్చుంటూ.

ఒక కథ చదివి, ఎలా వుందన్నట్లుగా కుతూహలంగా చూసేడు; చిన్న రచయిత.

"మీ రెండో కథే బావుంది" అన్నాడు గొప్ప రచయిత లేస్తూ.

ఆ గొప్ప రచయిత ఎవరు?

"ఓ. హెన్రీ"

అదుగో, ఏహో కొటేషన్ మార్కులు పెట్టేరే—!?

అవును. 'ఓ. హెన్రీ' అనేది ఒక రచయిత పెన్‌నేమ్ అని చాలా మందికి తెలియదు.

ప్రపంచంలో ఏ భాషలోనైనా సరే కథలు చదివే అలవాటున్న వాళ్ళందరికీ ఓ. హెన్రీ పేరు వినక తప్పదు చిన్నకథ స్వరూపానికి మూల స్రష్టలైన ముగ్గురు నలుగురు రచయితల్లో ఓ. హెన్రీ అగ్రగణ్యుడు.

ఓ. హెన్రీ అసలు పేరు విలియమ్ సిడ్నీ పోర్టర్. తండ్రి డాక్టర్ అల్గెర్నాన్ సిడ్నీ పోర్టర్. అతడొక వింత మనిషి వైద్యుడుగా వృత్తి చేసుకుంటూ ఏవో విచిత్రమైన యంత్రాలు కనిపెడదామని వుబలాటపడేవాడు. అప్పట్లో విమానాలు ఇంకా అన్ని దేశాల్లోనూ తయారయ్యేవిగాదు. విమానం తయారు చేద్దామని, నీళ్లతో

నడిచే కారు తయారు చేదామని, ఇలాంటి పనుల్లో నిమగ్నుడైపోయి వుండేవాడు. ఓ. హెన్రీ పుట్టిన మూడేళ్ళకే తల్లిచనిపోయింది తండ్రి అలాగా, తల్లి ఇలా గా కాగా, ఓ. హెన్రీ పినతల్లి 'ఎవెలినా' దగ్గర పెరగటం, విద్యాబుద్ధులు నేర్చుకోవటం జరిగింది. 'ఆంట్ లినా' టీచరు. ఆవిడకి సాహిత్యం అంటే ఆదరాభిమానాలు జాస్తి. తనదగ్గర విద్యాభ్యాసం చేసిన వాళ్ళందరిలోనూ కొద్దో గొప్పో ఆమె ఆ అభిరుచిని సంపాదించింది, అలా జరక్కపోతే ఓ. హెన్రీలో సాహిత్యపిపాస ఉండేదిగాదు. అతనెవరో తెలుసుకోవలసిన అవసరమూ మనకీ నాడు ఉండేది గాదు.

పదిహేనేళ్ళకే ఓ. హెన్రీ ఉద్యోగం చెయ్యవలసిన పరిస్థితి వచ్చింది. [illegible] మందుల షాపులో సేల్స్ బాయ్ పని. అక్కడుండగానే ఓ. హెన్రీ తన సహజ హాస్య ధోరణితో అందర్నీ ఆకర్షిస్తూ వుండేవాడు. కార్టూన్‌లు గియ్యడం ప్రాక్టీస్ చేసేడు.

క్రమ పద్ధతిలో కథలురాసి పేరు తెచ్చుకోనేలోపల ఓ. హెన్రీ జీవితంలో ఆశ్చర్యం, అద్భుత, భయానకం అయిన సంఘటనలు చాలా జరిగాయి. అతను టెక్సాస్‌లో 'లా సెల్లీ కౌంటీ'లో వ్యవసాయం చేసేడు. ఓస్టిన్‌లో సర్వే ఆఫీసులో గుమాస్తాగా చేసేడు బ్యాంక్‌లో బట్వాడా కేషియర్‌గా పనిచేసేవాడు. సర్వే ఆఫీసులో వుండగా ఎతెల్ ఉస్టిన్ అనే అమ్మాయితో లేచిపోయి ఆమెని వివాహం చేసుకున్నాడు. బ్యాంక్‌లో ఉద్యోగంవల్ల 11వేల డాలర్ల చిల్లర బ్యాంక్ సొమ్ము తైంకర్యాం చేసినట్లు అపవాదు లభించింది ముప్పై మూడో యేట డెయిలీ పోస్టు అనే పత్రికలో ఉద్యోగం కుదిరింది. అయితే ఆ మరుసటి ఏడాదే ఓస్టిన్ కోర్టుకు విచారణకి రమ్మని సమన్సురాగానే, న్యూ ఆర్లియన్సుకు పారిపోయి విచారణ

ఓ. హెన్రీకాలంలో అమెరికాలో కథలకు పారితోషికం చాలా తక్కువగా ఇచ్చేవారట. అందువల్ల తన రాబడిని ఎక్కువ చేసుకోవడానికి ఓ. హెన్రీఎక్కువ కథలు వ్రాయవలసి వచ్చేది.

ఒక రోజున ఓ. హెన్రీ తన కొత్త కథకు ప్రతిఫలం తెచ్చుకుందామని పత్రిక ఆఫీసుకు వెళ్ళాడు. అస్తమానం అతను కథలు వ్రాసి తమ ఆఫీసునుంచి డబ్బు గుంజుకుపోవడం చూసి కన్నుకుట్టిన ఒక గుమాస్తా "చెక్కు లపై సంతకంచేసే ఆయన కాలు బెణికింది. ఇంటిదగ్గరే వున్నారు" అన్నాడు

"అయితే ఆయన కాలితో సంతకాలు చేస్తారా?" అని అడిగాడు ఓ. హెన్రీ

తప్పించుకునేందుకు ఒకఏడాదిపాటు న్యూ అర్లియన్స్‌లో హొండ్యూరాస్‌లో లాటిన్ అమెరికాలో అజ్ఞాతవాసం చేసేడు. భార్యకి జబ్బుగా ఉందని తెలిసి ఓస్టిన్ నగరానికి తిరిగివచ్చేసి, పోలీసులకి స్వాధీనమై పోయాడు. మూడు సంవత్సరాల పైచిలుకు జైలుశిక్ష అనుభవించాడు. బ్యాంక్ వాళ్ళు ఆరోపించినట్లుగా తను 1153 డాలర్లు కైంకర్యం చెయ్యలేదని నిరూపించగలిగి ఉండికూడా, ఆధారాలన్నీ పోగుచేసుకోవటానికి అవకాశంలేక, పైగా సమన్సొస్తే పారిపోయాడనే అన్న హైన్యంచేతా, శిక్షకి తల వంచాడని అంటారు.

జైల్లోకూడా మందులు సప్లయ్ చేసే గుమాస్తాగా కుదిరాడు కొన్ని కథల ప్లాట్లు జైల్లో తన సహచరుల ద్వారా లభించినవే. ముఖ్యమైనది "ఎ రిట్రీవ్డ్ రిఫార్మేషన్" అనే కథ దీన్ని నాటకంగా "ఎలైస్ జిమ్మీ వేలెంటీన్" అనే పేరుతో వ్రాస్తే ఒక "బ్రాడ్వే" థియేటర్లో విజయవంతంగా ప్రదర్శించేరు

జైలునుంచి వచ్చాక న్యూయార్క్‌లో స్థిరపడి పుంఖానుపుంఖంగా వ్రాయటం మొదలుపెట్టాడు. 1904 లో 65 కథలు. 1905 లో 50. అట్లా ఒకే సంవత్సరం అన్నేసి కథలురాసిన కథకులు ప్రపంచం మొత్తంమీద చాలా అరుదు. ఎక్కువ రాయటానికి దోహదం చేసినది "వర్ల్డ్" అనేవార పత్రికలో అతని ఉద్యోగం, ఆ పత్రికలో వారానికో కథ వ్రాసే ఒప్పందం.

ఓ. హెన్రీ కథలు కొత్తగా చదివే వాళ్ళు, కొద్దిగా చదివిన వాళ్ళు, ఆయన్ని ఒక హాస్య రచయితగా తీసుకొంటారు. ఇది చాలా అన్యాయం. కథల ముగింపు చెయ్యడంలో ఆయనకి ఆయనే సాటి అనుకోండి– సింగిల్ ట్విస్టు, (కొసమెరుపు డబుల్ ట్విస్టులలో అద్వితీయమైన నేర్పు ఆయన సొత్తు. చివర్నినవ్వక తప్పదన్నమాట. ఈ నవ్వు ధోరణిచూసే సామాన్య దృష్టితో చదివే పాఠకులు ఆయన్ని హాస్య రచయితగా తీసుకొంటారు అయితే ఆయన ధ్యేయం హాస్యం కానేకాదు ఆయన ఎంచుకునే పాత్రలన్నీ గుమాస్తాలు, సేల్సుగరల్స్, చిల్లర యాక్టర్లు, టాక్సీ డ్రైవర్లు ఇలాంటి "వర్కింగ్ క్లాస్" జనసమూహం. ఈ జగన్నాథ రథం కోసం కలంపట్టి నిశితమైనహాస్యంలో నిబిడీకృతంచేసిన విషాదాన్ని, వేదనని సృష్టించడమే ఆయన ధ్యేయం. న్యూయార్క్‌లో స్థిరపడాక జైల్లో వున్నప్పుడు సరే ఆఫీసులో, బ్యాంకులో ఎక్కడ ఆయన ఉండి వుంటే అక్కడ అసంఖ్యాకులైన బాధా సృదష్టులుతటస్థపడి ఆయన సంస్కార హృదయాన్ని వేధించారు. వాళ్ళలో వుంటూ వాళ్ళను గురించి వ్రాస్తూ, పతనమైపోవడానికి సంఘం వాళ్ళమీదతెచ్చేఒత్తిడినీ,దాన్నినిగ్రహించుకునేందుకు వాళ్లు పడే తాప

తయాన్ని సంస్కార హృదయానికి మాత్రం తెలిసేటట్లు జాగ్రత్తగా చమత్కారంగా సటిల్ గా వ్రాశాడు. 'ఫోర్ మిలియన్' అంటే నలభైలక్షలు. ఆయన న్యూయార్క్ లో వున్నప్పుడా నగరం జనాభా అది. ఆ పేరుతో పుస్తకం వ్రాసి, అందులో కథలన్నిట్లో పైన చెప్పిన వర్కింగ్ క్లాస్ జీవితంతో అహోరాత్రులు నిర్విరామంగా నిర్వహించే సంగ్రామం హృదయంగమంగా చిత్రించాడు. ఒక్క ఉదారణ ఇస్తాం.

'గిఫ్ట్ ఆఫ్ ది మేగి'లో వర్కింగ్ క్లాస్ కి చెందిన దంపతులు జిమ్మీ, డెల్లా తెల్లారితే క్రిస్ట్మస్ ఒకరి కొకరు క్రిస్ట్మస్ ప్రెజెంట్ ఇవ్వాలనుకుంటారు. చేతిలో యిద్దరికీ డబ్బులేమ ... ... ... డెల్లా జిమ్ కి తెలియకుండా తన అందమైన జుట్టును అమ్మివేసి అతని గడియారానికి ఒక ప్లాటినమ్ చెయిన్ కొంటుంది. జిమ్, డెల్లాకి తెలియకుండా తన గడియారాన్ని అమ్మివేసి, ఆమె సుందరమైన శిరోజాల్ని నాగరికంగా ఆకర్షణీయంగా తీర్చిదిద్దుకోటానికి ఆమె ఎన్నాళ్ళనుంచో కోరుకొంటున్న మేలురకం దువ్వెన్ల సెట్టు (తాబేటి చిప్పతో చేసినవి) కొనితెస్తాడు. జుట్టుపోయిందని జిమ్ గోలపెట్టాడు. "ఫరవా లేదు, ఎంతసేపు, ఇట్టే పెరిగిపోతుంది నాజుట్టు" అని డెల్లా ఓదారుస్తుంది. "మన కానుకలు మనం వెనువెంటనే ఉపయోగించుకోటానికి ప్రాణం ఒప్పనంత మంచివి!" అని సమర్థించుకుంటాడు జిమ్.

కథంతా ఒకయెత్తు, ఆఖరుపేరా ఒకయెత్తు. గొప్పఆదర్శం. అనోన్యతకి నిదర్శనంగా క్రిస్ట్మస్ కానుక యివ్వటం. దానికోసం ఇద్దరికిద్దరూ తమకున్న అమూల్య నిధిని ధార పొయ్యటానికి వెనుదియ్యరు. త్యాగఫలం దక్కుతుందని ఆశ. కాని యెంత హృదయ విదారకమైన త్యాగమై పోయింది! — ఇది హాస్యంగా తీసుకోకూడదు. చార్లీ చాప్లిన్ హాస్యనటన లాంటిది ఓ. హెన్రీ హాస్యరచన. వేదనభరిస్తూ వ్యంగ్యం ప్రదర్శించే విశాల హృదయపు స్పందన, అది.

'ఎ సర్వీస్ ఆఫ్ లవ్', 'ది గ్రీన్ డోర్', 'ది అన్ ఫినిష్డ్ స్టోరీ'; 'ది కాప్ అండ్ ది ఏంథెమ్' 'ది లాస్ట్ లీఫ్'; 'ది కౌంట్ అండ్ ది వెడ్డింగ్ గెస్ట్' ఇలాంటివి అసంఖ్యాకంగా చూపించవచ్చు కరుణరసం నిబిడీకృతం చేసుకొన్న హాస్య కథలు వుదహరించాలంటే. వర్కింగ్ క్లాస్ జనానికి కేస్ట్ ఉంటుంది కాని అవకాశా లుండవు. ఎలాగో ఒకలాగ, చివరికి పతనమై పోయి అయినా సరే అభివృద్ధి సాధించాలని వుంటుంది. అభివృద్ధి కోసం కుట్ర, హత్య, దోపిడి, వ్యభిచారం చెయ్యాలని సిద్ధపడతారు. కాని తీరా సమయానికి 'ఆత్మా

వేనున్నానంటూ ప్రత్యక్షమై ఒద్దంటుంది అట్లా వాళ్లు పశ్చాత్తప్తులవటానికి కూడా సంఘం అనుమతించదు, అంటారు ఓ హెన్రీ వాళ్ళకి "సంఘం అనే అప్పర్ క్లాస్ గడసు ప్రపంచం యిచ్చే క్షోభని క్లుప్తంగా గుప్తంగా చెప్పడం ఓ హెన్రీ కృషితో సాధించిన గారడీ విద్య ఆ కథలన్నీ ఫోర్ మిలియన్ గా, "వాయిస్ ఆఫ్ ది సిటీ" గా "ది జెంటిల్ గ్రాఫ్టర్" గా రూపసంతరించుకొని బైటపడ్డాయి

* * *

ఓ హెన్రీ హాస్యం వెకిలిగా డైరెక్ట్ గా ఉండదు అతని చురక తిన్నవారు మళ్ళీ మాట్లాడుతే ఇకిను, అని అల్లంత దూరం వెళ్లేక ఈ లోపున ఆయన అన్న మాటేమిటో తెలిసి, "అమ్మ దొంగా" అనిపిస్తుంది బాధ కలిగినా నవ్వే వస్తుంది ఈ పద్ధతి తర్వాత తర్వాత చాలా అమల్లోకి వచ్చింది

నాకు తెలిసినంత వరకు మన దేశంలో చట్టంతో నిర్మూలించలేని రెండు దురాచారాలు ప్రబలి వున్నాయి ఒకటి, ఆ వాల్ స్ట్రీట్ స్పెక్యులేషన్ బిజినెస్ రెండోది బందిపోటుతనం"

"ఒకటి ఉందన్న సంగతి ఇంచుమించు అందరూ ఒప్పుకుంటారు

"అయితే మరి బందిపోటు తనం నిర్మూలించనక్కర్లేదటయ్యా?

* * *

ఓ హెన్రీ రచనల్లో కొంత శాతం సామ్యవాదం ఉందంటారు మహా కాటిక్షులు అంతా అదే అంటారు మరికొందరు 1962 లో ఓ హెన్రీ శతజయంతి పైగ ఎత్తున రష్యాలో జరగటం, శతజయంతి సంచిక ఆయన కథల్లో కొన్నిటిని ముద్రించటం గమనార్హం

* * *

"జీవితంలో అన్ని రసాలూ తెలుసుకొని చవి చూడాలంటే, దారిద్ర్యం, ప్రేమ యుద్ధం — ఈ మూడూ క్షుణ్ణంగా అనుభవిస్తే చాలు వాటిలో అన్నీ ఉన్నాయి" అన్నాడు ఓ హెన్రీ

—భరాగో



# కంచెలు

భమిడిపాటి జగన్నాథ రావు

రోడ్డు కిరువైపులా అర్థంలేని గడ్డి పూలు, పసుపుపచ్చని గడ్డిపూలు. ఏ ప్రక్క చూసినా ఎత్తు పల్లాలతో పెద్ద కొండలు, దూరానికి నున్నగా కనిపించే రాతి బండలు. ముందర నల్లని తివాసీ పరిచినట్టుగా తారు రోడ్డు. ఎండకు పదునెక్కి మెరుస్తూన్న తళతళలాడే రోడ్డు ఆ రోడ్డుని నలభైమైళ్ళ వేగంతో దాటే 'జీప్' ప్రక్కన సిగరెట్ కాలుస్తూ, యోగ ముద్రలో వున్న మౌనిలా శంకరం. ఉన్నట్టుండి అతని పెదాల చాటున మెరిసి మాయమైన చిరునవ్వు. రోడ్డుకు ప్రక్కగా చెట్టు నీడను ఊసులాడుకుంటూన్న 'ఎంకి, నాయుడు బావ'లు. సరసమాడుతూన్న నాయుడుబావని గోముగా చూస్తున్న ఎంకి. డ్రైవరు రాజు కళ్లలో చిలిపితనం. అంతలో బ్రహ్మజెముడు డొంకలో మెరుస్తూన్న అరచేయంత పెద్ద పువ్వు. జీప్ ఆపుజేసి, ఆ పువ్వు కోసుకోవాలని నా ఆరాటం నా కోరిక తెలిస్తే శంకరం నవ్వుతాడేమోనని సంశయం

ఆ కోరిక మనసులోంచి చెరిపేసి చుట్టూ చూశాను అన్ని వైపులా కొండలు. ఆ కొండలు దగ్గరవుతూన్నట్టు, అవి అన్ని వైపులనుండీ ముట్టడిస్తున్నట్టు అనుభూతి. అవి నన్ను బిగించివేస్తున్నట్టుగా ఆధారం లేని నా ఆలోచన.

. ఈ ఆలోచనలూ, ఆరాటాలూ నన్ను వదలవు. నా అర్థంలేని కోరికలు నన్ను వెంటాడుతాయి. నిలవనివ్వవు. ఏదికావాలో తెలీని అసంతృప్తి. మేలుకునే సుషుప్తి. మనసులో మూర్ఛ.

శంకరం నవ్వగలడు. డ్రైవరు రాజుకళ్ళల్లో చిలిపితనం తొణికిసలాడుతుంది. నాయుడుబావ, ఎంకీ లోకాన్ని మరిచి ఊసులాడుకోగలరు. గడ్డిపూలు కూడా పచ్చగా మెరిసి, ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. బ్రహ్మజెముడు డొంకకూడా పచ్చని, పెద్దపూవులను సృష్టించి హాసిస్తోంది

నాలోనే ఈ చీకటి, ఈ వ్యథ, ఈ అసంతృప్తి

వెంటనే ఏదైనా చేసి ఈ అసంతృప్తినీ, నిస్సహాయతనూ తొలగగొట్టాలి.

జీప్ అపు చేయించాను. ఆశ్చర్యపోతూ రాజు వెనకసీట్లోకి చేరేడు. స్టీరింగ్ ముందు కూర్చుని, ఒక్కసారిగా స్టార్టు చేసి, వేగంగా, అతివేగంగా నడిపేను. రాజు ముందుకు తూలి అపుకొన్నాడు. శంకరం నాకేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

అరవై మైళ్ళ వేగంతో ఇంటికి తీసుకొచ్చాను.

నుదుటిమీద చెమట తుడుచుకుంటూ, సోఫాలోకి ఒరిగాను.

ఆ వేగం, ఆ సంచలనం నాకేమీ సంతృప్తిని కలిగించలేదు.

శంకరం నా 'మూడ్' కనిపెట్టినట్టున్నాడు. 'లైట్' విప్పుకుంటూ "రాత్రి 'షికార్' వెళ్దాం. ఏర్పాటు చేయమని రెడ్డికి కబురు పంపుతాను" అన్నాడు.

"వద్దురా. నాకు ఇంటికి వెళ్ళిపోవాలని ఉంది. సాయంత్రం బయలుదేరుతాను."

ఓక్షణం ఆగి "ప్రయత్నంమీదనైనా మనసు మార్చుకోవాలన్నయ్యా. ఎన్నాళ్ళని ఆ స్మృతులతో బాధపడతావ్ ? ! శకుంతల వదిన నిన్నింత ఒంటరివాణ్ణి చేసేసి, అలా వెళ్ళిపోవడం చాలా దురదృష్టం" అన్నాడు శంకరం.

శంకరంకేసి చూశాను. వాడు తల దించుకొని ప్రక్క గదిలో వెళ్ళిపోయాడు. వాడు మా పిన్ తండ్రి గారబ్బాయి. నాకంటే చిన్నవాడు. నన్ను గురించి అంతా అర్థమయినట్టు మాట్లాడుతున్నాడు.

శకుంతల హఠాన్మరణం నాలోని 'వాయిడ్' సృష్టించిందని వాడి నమ్మకం. మా బంధువులందరి నమ్మకంకూడా అదే. కాని అది నిజంకాదని నాకు తెలుసు. అయినా ఆ విషయం ఈనాడు అందరికీ నేనెందుకు పైకి చెప్పాలి?

శకుంతలకూ, నాకూ మధ్య చాలా అగాధం వచ్చేసింది. కావాలని ప్రయత్నపూర్వకంగా ఎవ్వరూ సృష్టించక పోయినా, ఆ అగాధం పూడ్చలేమని ఇద్దరికీ తెలిసిపోయింది.

రానురాను ఆమె నాకు అందమైన శిల్పంలా కనిపించేది. అర్ధ్రిత లేదు, అలరింపు లేదు. ఆమెను ముట్టుకుంటే పాలరాతి శిల్పాన్ని తాకినట్టుగా, ఆమె నాకు చల్లగా, అతి చల్లగా తగిలేది.

నవ్వితే, చిరుగంటను మోగించినట్టుగా కాదు—కంచు ప్రతిమ అతి బింకంగా నోరుతెరచి, అంతలో సన్నగా చైతన్యంలేని నవ్వు నవ్వినట్టుండేది.

కాని, ఆమె నా భార్య కాని రోజుల్లో ఆమెకోసం నేను విలవిలలాడేను. ఆమె మా మేనమామ



రెండవ కూతురు మేనమామ పెద్ద కూతురు సరళను, నాకిద్దామని మామయ్యకూ, చేసుకోవాలని మా వాళ్ళకూ బాగా వుండేది. అప్పటికి కాలేజీలో చదివే మామయ్య పెద్ద కూతురు నన్ను చూసినప్పుడల్లా సిగ్గు పడేది. కాఫీ అందించి ఇంట్లోకి పారిపోయేది సరళ చూపే ఆ సిగ్గు నాకు వెగటుగా వుండేది.

కాని ఎత్తుపీటపై కూచున్న దేవిలా నిండుగా, తొణకకుండా వుండే శకుంతల నన్ను నిలవనిచ్చేది కాదు.

నేను శకుంతలనే చేసుకుంటానని పట్టుపట్టినప్పుడు మా ఇళ్ళల్లో రేగిన అలజడి మూడేళ్ళదాకా సద్దుకోలేదు. ఈలోపుగా సరళ పెళ్ళి చేసుకోనని చెప్పేసి, మెడిసిన్‌లో చేరింది. నేను మా నాన్న వ్యాపారంలో స్థిరపడిపోయాను.

నాలుగేళ్ళకు నా కోరిక నెరవేరింది. శకుంతల నాదైంది.

నాదైన శకుంతల నా కాళ్ళకే కాకుండా, ఆలోచనలకు కూడా బంధమైపోయింది. ఎత్తైన ఆకా

శంలో విహంగంలా విహరించే నా ఊహాలను ఆమె తనచుట్టూ మలుచుకోవాలని సూచించి, పటుపడ్డే సరికి మామధ్య మొదలైన చీలిక, ఒక సంవత్సరంలోనే వారధి కట్టలేని అగాధమైంది. మా చేతుల్లోంచి సుఖ జీవితానికి ముఖ్యమైనదేదో జారి పోయింది ఎప్పుడు జారిపోయిందో, తెలీకపోయినా, ఆ యథార్థం ఇద్దరికీ స్పష్టంగా మూడేళ్ళల్లోనే తెలిసిపోయి స్థిరపడిపోయింది.

అసలు నావల్ల ఆమె ఎండిపోయిందేమో? ఏమో! నేనా ప్రశ్నకు సరియైన జవాబు ఏనాడూ చెప్ప లేను.

ఆమె మరణం నాకు అసంతృప్తికి కారణం కాకపోయినా, ఆమె మరణం నన్ను విచలితుణ్ణి చేసింది. ఆమె మరణం గొప్ప "షాక్" నాకు. ఆ షాక్ నుండి తేరుకున్నాక చనిపోయిననాటి శకుంతలని చూసి నేను నిలువెల్లా చలించిపోయాను. నిద్రలో ఉన్నంత ప్రశాంతంగా వుంది ఆమె. ఆ అమితమైన ప్రశాంతి నాలో వణుకులాటిది కలిగించింది. నాకు ఆధారం లేని ఓ అనుమానం. నిద్ర మాత్రలు రోజూకంటే అధికం ఆ రాత్రి ఆమె ఎక్కువ వేసుకొందని నా మనసు నమ్మిన సత్యం.

మా బంధువుల దృష్టిలో మాది ఆదర్శ దాంపత్యం. శకుంతల హఠాత్మరణం మా వాళ్ళందర్నీ నిశ్చేష్టులను చేసింది. ఆ షాక్ నుండి తేరుకోలేక నేను ఇలా అయిపోయానని వాళ్ళ ఊహ.

...శకుంతల ఏనాటికీ తల్లి కాలేదని డాక్టరు చెప్పిన రోజున ఆ విషయాన్ని ఆమె అతి మౌనంగా వింది. తనకి పట్టనట్టుగానే వుంది — కాగితాన కనబడే ఎన్నటి, వాసనలేని పువ్వును చూస్తూ కాని ఆ కఠోర సత్యం ఆమెలో బడబానలాన్ని సృష్టించి ఆమెను దహించివేసింది.

దానికితోడు ఆమెను నేను అంటిపెట్టుకు వుండాలన్న విషయంలో ఆమెకు చాలా పట్టుదల.

తనకు అందం వుంది అలంకరణ చేతనవును లాలించి, మెప్పించ గలదు. తల్లి కాలేనంత మాత్రాన తను స్త్రీ కాకపోదు.

ఆమె అవిధంగా ఆలోచించేది. "ఆ" కారణంగా నేను మరీ దూరంగా వెళ్ళిపోతున్నానని ఆమె అభిప్రాయపడింది. అది నిజం కాదనీ, ఆమె నాకు ఆరాధ్యఅనీ చెప్పినా, ఆమె ఏనాడూ నమ్మలేదు.

చిన్ననాటినుండీ మక్కువ పెంచుకొని, పోషించుకుంటూ వచ్చిన ఇష్టాల్ని నేను ఆమెకోసం వదులుకోలేక పోయాను

చిన్నతనంలోనే "స్పోర్ట్స్" అంటే ఏర్పడిన మక్కువ, వివిధ క్రీడా రంగాలలోని ప్రపంచ ప్రము

ఖుల పేరు చెప్పుకుంటూ, వల్లిస్తూ తిరగడం, ఆ సరదా, యౌవన ప్రాదుర్భావంలో నాటుకుని, ఈ నాటికీనాలో నిల్చి, నన్ను నిలవన్వని సౌందర్యారాధన, సాహిత్యం అవలోడనం చేస్తూ మిత్రులతో ఆ ఆనందం పంచుకుంటూంటే కలిగే తృప్తీ, కొత్త ప్రదేశాలు చూస్తూ, ప్రకృతి వింత అందాలు అనుభవిస్తూ, ఆ ప్రకృతే నా కోసం సృష్టింప ఒడినట్టు ఆనందించడం ఇవన్నీ ఒక్క శకుంతల కోసం ఎలా వదులుకోగలను ?

భార్యాభర్తలకి ఏదో విషయం మీద మాటా మాటా వచ్చిమాటల్లేకుండా పోయాయి భర్త రెండు రోజులు ఓపిక పట్టాడు మూడో రోజున రాజీ పడక తప్పలేదు 'అమ్మా! నువ్వు చెప్పిన దానికి ఒప్పుకుంటున్నాను' అన్నాడు

భార్య 'అదేం లాభం లేదు నా మనసు మళ్ళీ మార్చుకున్నాను' అంది

వదులుకోలేనని చెప్పేను ఆ మాటవిని ఆమె మ్రాన్పడిపోయింది తరువాత ఆమె పోయింది

ఆమె పోయిన ఈ మూడేళ్ళ నుండీ నేను అతివెర్రిగా తిరిగాను

ఆమె నాకు బంధ మనుకున్నాను బంధం తొలిగినా, విశృంఖలత్వంలో నాకు కావలసినది దొరకనూ లేదూ, తెలియనూ లేదు అశాంతి పెరిగిందే కాని తగ్గలేదు

వారం రోజులై శంకరం దగ్గరకు వచ్చాను నాగరికతకు దూరంగా కొండలూ, అడవుల మధ్య వుంటున్నాడు వాడు, ఉద్యోగరీత్యా నేనంటే అభిమానం, సానుభూతీ వున్న వాడు. నా దిగులు పోగొట్టడం కోసం, లంబాడీల డాన్సు ఏర్పాటు చేశాడు రెండు రాత్రిళ్ళు షికార్‌కి వెళ్ళాము స్వర్గద్వారాల సన్నిధికి తీసుకుపోతాయని భ్రమించి, నమ్మేఘూకైన ద్రవాల్ని నాకోరిక పై రోజూ ఏర్పాటు చేశాడు

ఇవన్నీ నా దిగులునీ, అశాంతినీ, ఒంటరితనాన్నీ పెంచాయేకాని, తగ్గించలేదు నా ఈ అసంతృప్తికి ఎవరైనా కారణం చెప్పి సరిదిద్దితే బావుండును

ఆ సాయంత్రం ఇంటికి బయలుదేరేను మళ్ళా ఒంటరి నం ఒంటరిగా వుంటే నలుగురిమధ్యా ఉండాలని తపన చుట్టూ నలుగురూ వుంటే వాళ్లనందర్నీ చూస్తే విసుగు దీనికేదీ విరుగుడు ?

మర్రోజు ప్రొద్దుట రైల్లో రంగయ్య కనిపించేడు యూనివర్సిటీలో సహాధ్యాయి తొమ్మిదేళ్ళ తర్వాత కలిశాం వాణ్ణిచూడగానే ఆశ్చర్యమైంది నాకు మనిషి అతి

సన్నగా అయిపోయాడు బక్కతల కన్పిస్తోంది పెద్దవాడిలా అయిపోయాడు కాని వాగుడు మాత్రం తగ్గలేదు, మారలేదు

వాడి వాగుడు నాకు ఇష్టం వాడు ఏది మాట్లాడినా అసలు విషయం చుట్టూ వలయం అల్లి మాట్లాడతాడు నేను మాట్లాడవలసిన అవసరం వుండదు వాడి వలయంలో చిక్కుకోకుండానే, వాడి సంభాషణని నేను ఆనందించగలను

అందుచేత రంగయ్యని బలవంతం చేసి మా వూళ్ళో దింపేశాను

ఇంటికివచ్చి రంగయ్యకు గది చూపించి, లోపలికి వచ్చాను

గదిలో సరళ, మెడలో స్టెత స్కోప్‌తో కళ్ళుమూసుకొని సోఫాలో కూచునివుంది జుట్టు ముడి వేసుకొంది అది సాదా చీర

సరళ తల ఎత్తింది

"ఇలా వచ్చేవేం ?" అన్నాను

"అత్తయ్యకు వంట్లో బావుండలేదు ఇంజక్షనిచ్చాను నిన్న నీకు బయలుదేరమని టెలిగ్రామ్ ఇచ్చాను అందలేదా ?" అంది

'లే'దంటూ అమ్మ గదిలోకి వెళ్ళాను నిద్రపోతోంది

"ఇప్పుడు డిస్టర్బ్ చేయకు ఇప్పుడే నిద్ర పట్టింది" అంది సరళ ఆ కంఠంలో ప్రొఫెషనల్ టచ్ వుంది అది నాకు చురుక్కుమని తగిలింది

గదిలోంచి వచ్చేసి "ఎన్నాళ్ళనుంచి జ్వరం ?" అన్నాను

"నాలుగు రోజులైంది రేపు నార్మల్‌కు వస్తుందిలే మళ్ళా సాయంత్రం వచ్చి ఇంజక్షనిస్తాను" అంటూ వెళ్ళిపోయింది సరళ

ఒక్కతే కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయింది సరళ

రంగయ్య స్నానంచేసి వచ్చాడు భోజనమయ్యాక కబుర్లు మొదలెట్టాడు

"సావిత్రి ఇప్పుడెక్కడుందో తెలుసా ?" అన్నాడు

"తెలీ" దన్నాను

"నెల్లూరులో లెక్చరర్"

అలా ఎంతోమంది పాతమిత్రుల్ని జ్ఞాపకంచేసి వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలూ, ప్రస్తుత పరిస్థితీ అంతా చెబుతున్నాడు

ఆ చెప్పేటప్పుడు విషయమేదైనా వాడిలో ఉద్వేగంలేదు చాలా సాధారణంగా మాట్లాడుతున్నాడు మనకి తెలీని వ్యక్తుల్ని గురించి మాటాడుకుంటున్నట్టు

ఈ రంగయ్యకు ఇంతమంది విషయం ఎలా తెలుసో ?

"రామనాథం తెలుసుగా ?"

"జ్ఞాపకముంది కవిత్వమంటే ప్రాణం విడిచేవాడు" అన్నాను.

# గొలుసు లెక్క



ఈ బొమ్మలో మొత్తం అయిదు చిన్న గొలుసు లున్నాయి. ఒక్కొక్క గొలుసులో మూడేసి లింకులున్నాయి. ఒక లింకును విడదీయడానికి పది పైసలవుతుంది. మళ్ళీ అతకడానికి ఇరవై పైసలవుతుంది.

ఈ అయిదు చిన్న గొలుసులను కలిపి ఒకటే పెద్దగొలుసుగా ఎంత తక్కువ ఖర్చుతో అతక వచ్చునో కనుక్కోండి.

ఏదో విధంగా అతకడం కాదు. పైన చెప్పిన రేట్లను దృష్టిలో పెట్టుకుని వీలైనంత తక్కువ ఖర్చుతో పెద్దగొలుసు తయారు చెయ్యాలి. బాగా ఆలోచించండి. సరియైన జవాబుకోసం 96వ పేజీ చూడండి.

---

"వాడే! క్రితం ఏడాది ఉరి పోసుకు చచ్చిపోయాడు."

"అయ్యో! పాపం ఎందుకుట?"

"ఎందుకేవిటీ? వాడికేదో నిరాశగా వుందిట అలా అని ఓ చీటీ వ్రాసి వుంచి ఆ పనికాస్త చేసేశాడు, చేతకాని వాజమ్మ."

"శివరామ్ ఏం చేస్తున్నాడు? బావున్నాడా?"

"వాడికేం? నిక్షేపంలా వున్నాడు."

"చదరగం ఆడుతున్నాడా? ఆ రోజుల్లో రష్యన్లని మించిపోతాననే వాడు."

"వాడిప్పుడు చదరంగం ఆడటమా? ఇంకా నయం. వాడికిప్పుడు ప్రయివేట్లు చెప్పుకోడానికే టైమ్ చాలడం లేదు."

"మేష్టరీ చేస్తున్నాడా?" అన్నాను.

"ఔ. ఇది అయ్యాడుగా. ఐదుగురు పిల్లలు వాడికి – తెలుసా?"

నాకు మతిపోయింది. నాతో

పాటు చదువుకున్న వాడికి ఐదుగురు పిల్లలా ?

"అప్పుడే ఐదుగురు పిల్లలా ?" అన్నాను.

"ఏంకే వాడికి ముప్ఫై అయి దేళ్ళు నిండేడు "వేసెక్టమీ" చెయించుకున్నాడు నాకు మాత్రం నలుగురు మా ఆవిడ కింకో కుర్ర వెధవ కావాలనివున్నా, క్రికింం క్యాంపులో దానికి ఆపరేషన్ చేయించేశాను" అని నవ్వుతున్నాడు

"అయినా అంతవుంది పిల్ల లేవిట్రా ?– మనం ఇంకా చిన్న వాళ్ళం కదా "

"బావుందిరోయ్ ! ఇంకా ఎన్నాళ్ళు చిన్నవాళ్ళ మంటావ్ ? శివరామ్ పెద్దకూతురికి సంబంధాలు మాస్తున్నాడు రెండు, మూడేళ్ళల్లో వాడు తాత కూడా కావచ్చు "

నాకీసంగతి పరీ నమ్మశక్యం కాకుండా వుంది

"అలా చూడక వాడి పెద్ద పిల్లకి పద్నాలుగేళ్ళు మంచి సంబంధం కుదిరితే చేసేస్తాడుట నన్ను సంబంధమేదైనా చూడ మన్నాడు కూడానూ "

"ఏదైనా మీరంతా ఇంత ఊబిలో దిగబడిపోడం నాకు నచ్చ లేదురా" అన్నాను

"అబ్బాయ్ ! నే చెప్తున్నా విను పాతరోజులు పోయాయి ఆ సమయం దాటిపోయింది ఏదో ఇక ఇప్పటికైనా కాస్త కుదురుగా "సెటిల్" కావాలోయ్! ఎప్పటికైనా తప్పదుగా వాడు ఇల్లు కట్టాడు. పిల్ల పెళ్ళి జేయబోతున్నాడు "

"ఇల్లు కట్టాడా ?"

"మొన్న వైశాఖంలో గృహ ప్రవేశం కూడా అయిపోతే ? చిన్నదే అనుకో "

శివరామ్ సొంతంగా ఇల్లు కట్టాడని వినగానే నాకేదో కొత్త విషయం కంటి ముందు మసగ్గా కదిలింది

రంగయ్య ఇంకా చెబుతున్నాడు "పెద్ద వేట్లు ఉన్నాయిగా డబ్బుసంపాదించాడులే నేను కూడా సైట్" కొన్నాను వచ్చే ఏడు ఇల్లు కట్టేస్తా "

ఈసారి నా కళ్ళముందు మసక కరిగిపోయి విషయం అర్థమయి పోతోంది మిగిలిన సందిగ్ధత కాస్తా రంగయ్య ఆ సాయంత్రం వెళ్ళిపోతూ అన్నమాటలవల్ల పూర్తిగా చెరిగి పోయి అంతా కరతలామలకం అయిపోయింది

"ఒరేయ్ వెంకట్రావ్ ! వచ్చే ఏళ్ళే కాని వెనక్కి వెళ్ళేవి కాదు గదా ! అందరం ముప్ఫయిదాటి నలభయ్యో పడిలో పడినవాళ్ళమే ఎన్నాళ్ళంటావ్ దాగుడుమూతలు ? ఈ జీవితానికి అర్థం, గమ్యం ఉన్నాయో, లేదో కాని – ఉన్నా మనకు తెలియనూ తెలియదు, కన




బడనూ కనబడవు. చదువుకొనే రోజుల్లోని కలలన్ని, ఎంతమధురమైన వైనా, కాలం గడిచినకొద్దీ, అవి కొన్ని కరిగిపోకా తప్పదు. మరికొన్ని రూపం మారుకోకా తప్పదు. అదిరూల్. ఆరోజుల్లో కలలు కనడం వంటికి, మనస్సుకీ ఎంత మంచిదో ఈనాడు కాస్త "సెటిల్" అవడం కూడా అంతే మంచిది.

నీకు మాత్రం?... ముప్ఫయి మూడు వచ్చి వుంటుంది. లేక వెళ్ళిందా? అవునా? ఇప్పటికైనా కాస్త ఏదైనా ఊతఃట్టుకొని కలల్నీ, నిజాల్నీ కలగలిపి హాయిగా ఒతి కేయ్"

రంగయ్య వెళ్ళిపోయాక అర గంట దాకా ఒక్కణ్ణీ కూచుండి పోయాను. వాడు చెప్పిన దాంట్లో "నీకూ ముప్ఫయి మూడు వచ్చి వుంటుంది" అన్న పచి నిజం నాకు ముల్లులా గుచ్చుకుంటోంది. ఆ సంగతి నేనాడూ ఆలోచించలేదు. నేనింకా చిన్నవాణ్ణనే నా ఊహ.

అద్దంలో చూసుకున్నాను.

రంగు తగ్గలేదు. జుట్టు నెరవ లేదు. కళ్ళల్లో మెరుపు తగ్గలేదు. కాని కనపడే నా రూపంతోపాటు కనబడని మనసులోని మార్పు ఆ అద్దంలో మొదటిసారిగా కనబడింది.

నా కళ్ళముందు ఏదో గొప్ప నిజం తెర తొలగించుకొని ఎదురు నిలిచినట్టుయింది. కలలూ, ఆదర్శాలూ, ఆలోచనలూ ఆత్మగతం చేసుకుని కూడా స్థిరత్వం సంపాదించేందుకు వలసిన మూల సూత్రం నాకు గోచరించింది. నా మనసు నిండా తృప్తి నిండింది.

సాయంత్రం సరళ వచ్చింది. అమ్మకి ఇంజక్షనిచ్చి "వెళ్ళొస్తాను" అంది.

"నన్ను వంటరిగా చేశావ్?" అన్నాను.

నా నుండి అలాంటి మాట రావడం కొత్త. ఓ క్షణం ఆశ్చర్యపోయి, అది వెంటనే దాచేసుకొని "నీకు జబ్బు లేదుగా" అంది.

"జబ్బు లేదుగానీ, కాసేపు కూచుందూ."

"పేషెంట్సు నా కోసం ఎదురు చూస్తూ వుండరూ?"

"నన్నూ ఓ పేషెంటే అనుకో కూడదూ?"

"అయితే హాస్పిటల్‌కి వచ్చి, "క్యూ"లో నిలబడు" అంది నవ్వేస్తూ.

"పేషెంట్‌గా తప్ప నన్ను మామూలు మనిషిగా చూడలేవా?"

"నువ్వు నన్ను ఆవిధంగా చూడమన్నదెప్పుడు? అవకాశమే లేదుగా" అంది పెదాలు తడుపుకుంటూ.

ఆమె కంఠంలో జీర.

వెళ్ళిపోడానికి లేచింది.

ఆమె చేతులు పట్టుకొని అన్నాను. "నా మనసంతా దిగులు. పెద్దవాడి నయిపోతున్నాను. వయసు మళ్ళిన తల్లి తప్ప నాకింకెవరూ లేరు. నీ దగ్గర చోటిచ్చి, నాకు కాస్త విశ్రాంతి ఇయ్యి."

ఆమె అప్రతిభురాలై చూసింది. కాని "ఇది నిజమా?" అన్న అనుమానం ఆ కళ్ళల్లోంచి పోలేదు.

"నన్ను నమ్ము సరూ. నాకు కావలసిన దేమిటో నాకిన్నాడు తెలిసింది. నా జీవితం పరిభ్రమించే పరిధి చిన్నది. ఓ నలుగురు ఆత్మీయులైన స్నేహితులు, అందమైన సాయంకాలాలు, నచ్చిన కొద్ది పుస్తకాలు, ప్రశాంతంగా వుండే ఇల్లు, నా ఇల్లాలు – ఈ పరిధి చిన్నదే. కాని నా చూపుకు అవధి లేదు. లోకమంతా పరిభ్రమిస్తుంది. అన్నీ అవలోకిస్తుంది. పరిమితిలేని నా చూపుకూ, చిన్నదైన నా జీవిత పరిధికీ సరియైన వంతెన ఎలా కట్టాలో, సరియైన పునాదులమీద నిలచిన ఆ వంతెన మీద జీవితం ఎంత ఆనందదాయకమో నాకు తెలిసివచ్చింది.

నిన్ను నేను అర్థిస్తున్నాను, నన్ను నమ్ము."

ఆమె నా కన్నీళ్ళు తుడిచింది.

మరో పది నిమిషాల్లో ఆమె తన కారులో నన్ను పక్కన కూచుండబెట్టుకొని, కారు నడిపిస్తూ తీసుకువెళ్ళింది.

ఆమె బుజం మీద ఒరిగి, ఏ దిగులూ లేకుండా విశ్రమించాను.

* * *

# నేను ఆశావాదినా? నిరాశావాదినా?

"నువ్వు ఆశావాదివా? నిరాశా వాదివా?" అని ఎవరైనా ప్రశ్నిస్తే మరో ఆలోచన లేకుండా నిరాశా వాదినని చెప్పేస్తాను. ఎందుకంటే నేను నిజంగా లోలోపల ఆశావాదిని. కాని, ఆ ముక్క ఎప్పుడూ పైకి చెప్పను స్వానుభవం వల్ల ఈ జీవిత సత్యం నేర్చుకున్నాను.

ఒకటికాదు. రెండుకాదు – నేను పుట్టి, బుద్ధి ఎరిగిన తరవాత ఎన్నో అనుభవాలు నెత్తిమీద మొట్టుకుంటూ వచ్చాయి. ఎన్నోసార్లు తల బొప్పికట్టింది. దాంతో ఇహ లాభం లేదని నిరాశా వాదిగా మారిపోయాను, ఆశావాదిగా వుంటూనే.

కొన్ని ఉదాహరణ లిస్తేగాని ఈ జీవిత సత్యం మీకు బోధపడదు.

నాకు బాగా జ్ఞాపకంవున్న ఒక అనుభవం నా ఆరోగ్యానికి సంబంధించింది. ఒకసారి స్నేహితుల దగ్గిర – పబ్లిగ్గా – బడాయి పోయాను: నాకు జ్వరం వస్తేరాదని, ఇంతవరకెప్పుడూ రాలేదని.

రెండో రోజునో, మూడో రోజునో చచ్చేంత జ్వరం ముంచుకొచ్చింది. ఆ దెబ్బా దెబ్బ నెల్లాళ్ళదాకా మంచం పట్టాను.

కె. వి. రామచంద్రమూర్తి




అప్పటినుంచీ పద్ధతి మార్చేశాను. ఎవరైనా నన్ను "ఏమోయ్, బావున్నావా?" అని అడిగితే 'ఆ, ఏం బావుండడం లెండి. ఎప్పుడూ ఏదో నలతగా వుంటూనే వుంటుంది. ఆరోగ్యం బొత్తిగా చెడిపోయింది— నీరసంగా వుంటోంది—' అని సమాధానాలు చెబుతూ వుంటాను. అలా చెప్పడంవల్లే ఆరోగ్యానికి, అనారోగ్యానికి మధ్యస్థంగా ఒతకీడ్చుకొస్తున్నాను.

దీనికి నేను కనిపెట్టిన ఒకసూత్రం వుంది. "నాకెప్పుడూ జ్వరంరాదు" అని బడాయిగా చెబితే జ్వరానికి కోపం వస్తుంది. 'ఓహో! వీడి పని ఇల్లావుందా? వీడి పొగరు అణుస్తానాగు!" అని మీది కొస్తుంది.

అలా కాకుండా 'వొంట్లో బావుండడం లేదుసార్!' అని వినయంగా చెబితే 'ఫరవాలేదు. వీడు బుద్ధిమంతుడి లాగానే వున్నాడు.' అని దయతలచి జ్వరం మన జోలికి రాదు

అంటే ఏమిటన్నమాట? మనుషులకి, జంతువులకేకాక, ప్రాణంలేని వస్తువులకి, జరగబోయే సంఘటనలకి కూడా పరేంగితజ్ఞానం వుంటుందన్నమాట అవి మన్ని ఏడిపించాలంటే ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాయి. అనుగ్రహం కలిగితే ఆకాశానికెత్తేస్తాయి. నిజానికి అవే మన జీవితాన్ని తమ చెప్పు చేతల్లో వుంచుకుని మన్ని నడిపిస్తున్నాయి.

ఈ విషయం మీకు అర్థం కావడానికి మరికొన్ని ఉదాహరణలు చెప్పాలి.

మౌంటురోడ్డులో మీరు ఒకటో నంబరు బస్సుకోసం నిలబడతారు. మీరు అర్జంటుగా వెళ్ళవలసి వున్నట్టు దానికి తెలిసి పోతుంది. ఎంతసేపు ఎదురుచూసినా ఛస్తేరాదు. మీకు అక్కర్లేనినంబర్ల బస్సులెన్నో వస్తాయి, పోతాయి. ఆరుద్రమల్లే 'నీవు ఎక్కదలచిన బస్సు—ఎప్పుడూ ఒక జీవితకాలం మిస్సు—' అనుకుంటూ నిరాశలో కుంగి పోతుంటారు.

అయితే, ఇక్కడే మీకు నేను చెప్పిన నిరాశావాదం అక్కరకు వస్తుంది. (నిరాశ వేరు, నిరాశా




వాదం వేరు) అప్పుడేం చెయ్యాలంటే 'అని పిచ్చిగాని, ఇప్పుడు ఒకటో నంబరు బస్సు ఎందుకు వస్తుంది? రాదు రాదు. అదిగో ఆ వచ్చేది ఇరవై ఒకటో నంబరు బస్సు. అదేం, స్పష్టంగా నంబరు కనబడుతుంటేనే?' అనుకోవాలి. ఊరికే అనుకోవడంకాదు. తన్ను మోసగించడానికి అలా అనుకుంటున్నట్టు ఒకటో నంబరు బస్సుకి తెలియకూడదు. నిజంగానే, మనస్ఫూర్తిగా చిత్తశుద్ధితో నిరాశ చేసుకోవాలి. మనం బస్సుకోసం ఎదురుకూడా చూడకూడదు. మనలో మనమేదో ఆలోచించుకుంటూ పరధ్యానంగా వుండాలి. అప్పుడు రపీమని ఒకటో నంబరు బస్సు వచ్చేస్తుంది. హాయిగా దానిలో ఎక్కి వెళ్ళిపోవచ్చు.

ఇలా ఎన్నిసార్లు నాకు జరిగిందో చెప్పలేను. ఎన్ని రకాల సందర్భాల్లో జరిగిందో చెప్పలేను

ఏది జరగాలని కోరుకుంటామో అది జరగదు. ఏది జరుగుతుందని కలలో కూడా అనుకోమో అది అమాంతంగా జరిగిపోతుంది. ఇది జీవిత సూత్రం.

మీరు ఏదన్నా ఉత్తరంకోసమో, మనియార్డరు కోసమో ఎదురుచూస్తూ వుంటారు. పోస్టువాడి కోసంచూసిచూసి మీకళ్ళుకాయలు కాస్తాయి; పువ్వులు కూడా పూస్తాయి. ఊహు. పోస్టువాడు మీ ఉనికిని గుర్తించనేగుర్తించడు. అందరికీ ఉత్తరాలిస్తాడు; అందరికీ మనియార్డర్లు ఇస్తాడు మీకు మాత్రం ఎన్నిసార్లు అడిగినా జాలిగా "లేదు సార్!" అంటాడు. రోజూ అడుగుతుంటే నీ మొహానికి మనియార్డరుకూడానా? అన్నట్టు ఒక చూపుచూసి జవాబివ్వకుండా వెళ్ళిపోతాడు.




అప్పుడు మీరు నిరాశ చేసుకుని గుండెరాయి చేసుకుని ఎదురు చూడ్డం మానేస్తారు. మీ పనిలో మీరు మునిగిపోయి దాని సంగతే మరచిపోతారు. అప్పుడు హఠాత్తుగా 'ఎంవోసార్' అంటూ ఎక్కడలేని గౌరవం తెచ్చిపెట్టుకుని సలాం చేస్తున్న పోస్టువాడి కంఠం కోకిల కూతకంటే తియ్యగా వినిపిస్తుంది.

మీరు ఒక పెద్దమనిషితో పని తగిలి మైలాపూర్‌నుంచి అష్టకష్టాలు పడి కోడంబాకం వెడతారు. ఆయన ఇంటిదగ్గర వుంటాడని మీరు అనుకుంటూ, ఆయనతో మాటాడవలసిన విషయాలన్నీ తూ. చా. తప్పకుండా మాటలు, పాటలు, సినేరియోతో సహా స్క్రిప్టు అంతా సిద్ధం చేసుకుని వెడతారు. ఆయన ఇంట్లో వుండడని మీకు గ్యారంటీగా రూపాయిన్నర స్టాంపు కాగితంమీద రాసిస్తాను.

అలా కాకుండా 'అబ్బే ఆయన ఇంట్లో వుండడు. ఎందుకుంటాడూ? ఉండవలసిన అవసరం ఏముంది? బహుశా వూళ్ళోకూడా వుండడు. ఉండడయ్యా, నీకెక్కడూ చెప్పేది?' అని పూర్తిగా నిరాశతో, కేవలం డ్యూటీగనక వెడుతున్నట్టు వెళ్ళండి. నూటికి 90 పాళ్ళు ఆయన మీకు దొరుకుతాడు. దొరక్క పోయినా ఫరవాలేదు. మీరెలాగూ ఉండడనే అనుకుని వెళ్ళారు కనుక మీరు నిర్ఘాంతపోరు, కుంగిపోరు. ఏమీ జరగనట్టు మామూలుగా ఇంటికి తిరిగివచ్చేస్తారు. అదే నేను మొదటి నుంచి మొత్తుకుంటున్న నిరాశావాదంలోవున్న గొప్పదనం!

నాకు తెలిసిన ఒకాయనకి నాలుగేళ్ళ కూతురుంది. ఆ అమ్మాయి "మూగమనసులు" సినిమా పాటలన్నీ చాలా బాగా పాడుతుందని అందరితో చాలా గర్వంగా చెప్పుకునేవాడు. ముఖ్యంగా "గోదారిగట్టుంది" అనేది మరీ బాగా పాడుతుందట. ఎవ్వరూ నమ్మేవారుకారు నాలుగేళ్ల పిల్ల బాగా పాడటమేమిటని. ఒకరోజున నలుగురు స్నేహితులను ఇంటికి ఆహ్వానించాడు స్పెషల్‌గా బజ్జీలు చేయించాడు. కాఫీఇచ్చాడు. తరువాత పాటకచ్చేరీ. కూతుర్ని వొళ్ళో కూర్చోపెట్టుకుని "పాడమ్మా వాళ్లంతా వింటారు" అన్నాడు

ఆ పిల్ల పాడలేదు. ఎంతసేపు బతిమాలినా నోరెత్తలేదు చివరికాయన గట్టిగా గదమాయించాడు – "పాడతావా లేదా?" అని ఆ అమ్మాయి

బావురుమంది ఇహ ఆ పెద్ద మనిషి ఎంత స్లిగు పడిపోయాడో చూసుకోండి

మీరు ఆఫీసులో ఏదో పొరపాటు చేశారనుకోండి ఆఫీసరు చూడొచ్చాడా అని ధీమాగా దర్జాగా ఆఫీసుకి వెళ్లారా? తప్పకుండా అవాళ మీకు తిట్లు చివాట్లు తప్పవు అలాకాకుండా "బాబోయ్! ఆఫీసరు తిడతాడు గావునోయ్ దేవుడా! ఏదిగతీనాకు? అని భయపడిపోతూ వెళ్ళండి ఆఫీసరు మీ సంగతే ఆలోచించకుండా తన పని తను చేసుకు పోతాడు



కథలపోటీలో మీకు ప్రైజు వస్తుందని ధీమాగా వుండండి రాదు రాదనుకోండి వస్తుంది (రావచ్చు)

ఎలక్షన్‌లో గెలుస్తానను కోండి గెలవరు డిపాజిట్టు పోతుందను కోండి పోదు (గెలిస్తే గెలవచ్చు కూడా)

ఇలా ఎన్ని ఉదాహరణలైనా చెప్పగలను ఒక్క మాటలో చెప్పాలంటే ఏది కావాలని కోరితే అది రాదు వద్దనుకున్నది, రాదను కున్నది వస్తుంది ఇది నేను కని పెట్టిన జీవిత రహస్యం

అందుకే నా సలహా వినండి ఏది జరగాలనీ మీకు కోరికగా వుంటుందో దాన్ని ఎప్పుడూ కోరుకోవద్దు అది జరగదనే — వీలైతే జరగగూడదనే-కోరుకోండి అలాగే ఏది జరగగూడదని మీకు లోపల వుంటుందో అదే జరుగుతుందని భయపడిపోతూ వుండండి మీకు జీవితంలో ఢోకా వుండదు

ఈ నిరాశావాదంతో కూడిన ఆశావాదాన్ని ఒక సిద్ధాంతంగా డెవలప్ చేయడం మాత్రమే నేను చేసిన పని ఇది మన అందరిలోను కొద్దోగొప్పో వుంటుంది అందుకే ం ఏదో ఈ మాదిరిగా నైనా ఎకు వెళ్లదీసున్నాము లేకపోతే ఎడో మట్టి కొట్టుకు పోయే శ్యం కాదుటండీ

***

# పగ్గం!

**విద్యార్థుల చిన్న కథల పోటీలో**
**మొదటి బహుమతి (రూ. 50) కథ**

"భానుకు వాసు వ్రాయునది..." అని చదివి, ఓ క్షణం ఆగింది భానుమతి.

వాసు భానుమతికి దూరపు బంధువు. నిత్యం నవ్వుతూ నిష్కల్మషంగా మాట్లాడుతాడు. రెండేళ్ళ క్రిందట ఒకరోజు – ఎదలోని వ్యథ వంతా భానుముందు వెళ్ళబోసుకున్నప్పుడు, ఆమె పల్కిన చల్లని మాటలు అతని మండే హృదయానికి ఉపశమనాన్ని కలిగించాయి. అయితే ఇప్పుడీ విధంగా ఎందుకు ఉత్తరం రాస్తున్నాడో అనుకుంది భానుమతి. ఆమె తిరిగి చదవ సాగింది.

"రెండేళ్ళ క్రిందట నిన్ను మొదటిసారి చూచినప్పుడు నీలోని నిర్మలత్వం, గంభీరతా నాకు నీపై ఎనలేని గౌరవాన్ని కలిగించాయి. నీ వయస్సులో మా అమ్మ ముమ్మూర్తులా నీలాగే వుండేదని, చిన్న సోదెమ్మ గారి ద్వారా విన్నాను. ఆవేళ నిన్ను చూచిన తర్వాత నా ఆనందానికి పగ్గాలు లేకపోయాయి. నీకు పెద్ద ఉత్తరం రాయడం నాకు ఇష్టంలేదు. లుక్లుప్తంగా అసలు విషయం రాస్తున్నాను. ప్రస్తుతం నేను పై చదువుకై అమెరికా వెళ్తున్నాను. అజ్ఞాన దశలోనే తల్లిదండ్రుల్ని కోల్పోయి, పెద్దమామగారలకు దూరంగా పెరిగిన నాకు, ఇక్కడ కావలసిన వారెవరూ లేరు. అందుకే అమెరికాలోనే సెటిల్ అయిపో నిశ్చయించుకున్నాను. వెళ్ళేముందు ఆఖరుసారి నిన్నొక్కమారు చూడాలని ఉంది. పదమూడవ తారీఖు మెడ్రాసు-ఢిల్లీ జి. టి. కి విజయవాడ స్టేషన్‌కి రావలసిందిగా ప్రార్థిస్తున్నాను–వాసు."

జాలితో ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి. పయిట చెంగుతో కళ్ళు ఒత్తుకుంది. ఒకవేళ తను స్టేషనుకు

వెళ్ళకపోతే ... లేనినింత ఉన్నతంగా ఊహించుకున్న అతని సున్నిత హృదయం జీవితాంతం విలపిస్తుంది! అది తాను సహించలేదు అందుకే వెళ్ళి ఏదో విధంగా వాసుకు మనో ధైర్యం చేకూర్చాలి! పద మూడో తారీకంటే ఇవాళే. రాత్రి ఏనిమిది వరకు రైలు.

* * *

చదువుతున్న హిందూ పేపరు ప్రక్కన పడేసి, తేలిగ్గా నవ్వేశాడు విశ్వనాథం.

"అతను నీకే మవుతాడు?"

"ఏం?" అంది భాను.

"ఏంలేదు ఊరికే ... చెప్పు"

"మా పినతల్లి అడ పడుచుకు మనవడు"

"కావచ్చు గాని, సాయంత్రం స్టేషనుకు వెళ్ళక్కరలేదు"

నివ్వెర పోయింది భాను!

"పాప, అంతలా రాశాడు. వెళ్ళక పోతే ఎంత బాధపడతాడో. మళ్ళీ ఈ దేశం రానే రాడుట' — నీరసంగా ఆఖరి ప్రయత్నం చేసింది భాను.

"మరేం కొంప మునగదు. వీలు లేక పోయింది కాబోలు, రాలేక పోయిందనుకుంటాడు." — విశ్వ నాథం ఉచ్చరించే ప్రతీ మాటలోనూ నిర్లక్ష్యం ద్యోతక మవుతోంది.

పందిరి మంచమ్మీద వాలి, తల గడాలో తల దూర్చేసుకుంది భాను.

* * *

సాయంత్రం అరయింది. భాను మతి ఇంకా అలానే పడుకుంది. విశ్వనాథం తన అంతరాంతరాల్లో ఏ మాలోచించాడో ఏమో, ప్రక్కన కూర్చొని, లాలనగా 'భానూ' అన్నాడు. విసురుగా మొహం అటు తిప్పేసుకుంది.

"మా వాసును చూద్దాం. లేచి తయారవు, భానూ" అన్నాడు ఆమె నమ్మలేక పోయింది.

మళ్ళీ అవే మాటన్నాడు విశ్వ నాథం దిగ్గునలేచి కూర్చుంది భాను. అప్పటి దాకా ఆమె ఏడ్చినట్టుగా బుగ్గలమీద కన్నీటి చారలు. 'నిజ మేనా' అన్నట్టు చూసింది.

"నిజమే భానూ ... లే ... నువ్వు రెడీగావుండు. నేనిప్పుడే బజారు వెళ్ళి వస్తాను' అని వీధిలోకి వెళ్ళిపోయాడు విశ్వనాథం.

* * *

వేచి వేచి నిస్పృహ చెందిన వాసు మొహంలో తళుక్కున మెరుపు మెరిసింది. ఓవర్ బ్రిడ్జి దిగుతున్న భానునీ విశ్వనాథాన్నీ చూచి, పరు గెత్తుకొచ్చి,

"ఏం భానూ, ఇంత లేట్ గా వచ్చారేం" అన్నాడు.

"దార్లో కారు ట్రబుల్ ఇచ్చిం దండీ" – ప్రశాంతంగా అన్నాడు విశ్వనాథం.

"పోనీ, ఆఖరు క్షణాల్లో నయినా వచ్చారు. దేవుడు చాలా మంచి

వాడు" - ఏదో "అనిర్వచనీ యానం దంతో వాసు కళ్ళు మిలమిలా మెరు స్తున్నాయి

"మదరాసునుండి న్యూఢిల్లీ పోవు జి. టి ఎక్స్‌ప్రెస్ ఒకటవ నంబరు ప్లాట్ ఫాం నుండి బయలుదేరుటకు సిద్ధముగా నున్నది"-ముందు ఇంగ్లీషు లోనూ, తరువాత తెలుగులోను అనౌన్స్ చేశారు

గబుక్కున కంపార్టుమెంటు లోపలికి వెళ్ళి, ఒక పట్టు చీరా జాకెట్టుగుడ్డా తెచ్చి భానుకిచ్చాడు వాసు.

"ఇవెందుకు వాసూ" అంది.

మాట్లాడలేక పోయాడు వాసు. అమాయకంగా నవ్వేడు. ఆ నవ్వు ఆమె హృదయాంతరాళంలో చిరు పంచలనం కలిగించింది.

"సరే కానీ, వాసూ! నువ్వక్కడ కాలో సెటిలయి పోతాననడం నాకేం నచ్చలేదు చదువ్వయిన వెంటనే తిరిగొచ్చెయ్యాలి! తెల్సిందా?" - వాసు మొహంలోకి సూటిగా చూస్తూ అంది భాను.

పదినెల్ల పాపాయిలా నవ్వేడు పాతికేళ్ళ వాసు.

"ఇదిగో, అన్నిటికీ నువ్వు అలా నవ్వితే నాకు భలే మండుతుంది. చెప్పు, అక్కడ ఉండిపోడానికి వీల్లేదు. సరేనా?"-రైలు కదల బోతోందనే తొందర్లో, అతని సమా దానాని కెదురు చూస్తూ గబ గబా అన్నది భాను.

"ఈ జీవితంలో నాకింకేం అక్కర్లేదు భానూ. నా కోరిక మన్నించి నన్ను చూడ్డానికొచ్చావు. అంతే చాలు" — కదిలి పోతున్న రైల్లో తలుపు దగ్గిర నించుని చెయ్యి ఊపుతున్నాడు వాసు.

అంత కంతకూ దూర మవుతున్న వాసుని ఆఖరుసారి చూసి కళ్ళు ఒత్తు కుంది. ఒక్క ఐదు నిమిషాలు ముందుగా వచ్చి ఉంటే వాసుని ఒప్పించ గలిగి ఉండేది భానుమతి!!

'అరగంటయి రైలు వస్తే, బొత్తిగా మాట్లాడ్డానికి టైం లేకుండా ఆఖరి క్షణంలో తీసు కొచ్చారు" — బయటి కొచ్చి, ప్లిమత్ కారులో భర్త ప్రక్కన కూర్చుంటూ, కలత చెందిన మన స్సుతో నిష్ఠూరంగా అంది భాను.

విశ్వనాధం తన అరవయ్యేళ్ళ జీవితంలోనూ మనుషుల్ని నమ్మలేక పోయాడు

నిండా ఇరవై ఏళ్ళయినా లేని తన మూడో భార్య భానుమతి నెలా నమ్మగలడు? పండు మీసాల్లో నిండుగా నవ్వుకున్నాడు విశ్వనాధం!

***

# రామేశ్వరం వెళ్ళినా...

రెండవ బహుమతి (రు. 25) కథ

ఒకే విధంగా పరిభ్రమిస్తున్న జీవితంలో మార్పు టానిక్కులా పని చేస్తుందనే భావంతో దేశాటనం చేయ నిశ్చయించేను. ముఖ్యంగా నా ప్రయాణానికి కారణం అంతకు ముందు నెల్లాళ్ళనుండి ప్రతిరోజూ తప్పనిసరిగా వింటూన్న రంగనాథం లెక్చర్లు. మొదట్లో రంగనాథంతోటి నా పరిచయం విచిత్ర పరిస్థితుల్లో జరిగింది. చూచిన మొదట్లోనే ఆయన గురించి సదభిప్రాయం కలిగింది. "ఎంతటి దయామయుడు రంగనాథం" అనుకొన్నాను

అది దయనీయమైన దృశ్యం మా యింటికి సమీపంలోనే ఉంటూన్న సోమసుందరంగారు అకస్మాత్తుగా ఒకనాడు గుండె నొప్పివచ్చి మరణించేరు. ఆయనకు ఆరుగురు కుమార్తెలు, ఐదుగురు కుమాళ్ళు. ఆయనపైనే ఆధారపడి వుండడం మూలాన ఆయన మరణం వారిని నట్టనడి సముద్రంలో ముంచి వైచింది. వారిని చూడ్డానికి నేను ఒకనాడు వారింటికిపోయేను. అదే సమయంలో ... రంగనాథం కూడా అక్కడకువచ్చి సోమసుందరం భార్యకు వెయ్యి రూపాయలు యిస్తూండగా చూచి నా కళ్ళను నేను నమ్మలేకపోయేను ఆయన ఇలాగన్నాడు:

"అంతా విధివిలాసం ... పుట్టిన ప్రతిమనిషీ ఏనాడో మట్టిపాలు కావలసిందే. ఒకరుముందు ఒకరు వెనుక. అంతే భేదం. ఈ వెయ్యిరూపాయలు జాగ్రత్తగా వడ్డీకి వేసుకుని కాలక్షేపం చేయండి" అంటూ పది వంద రూపాయల నోట్లు యిచ్చేడు.

"ఎంత కరుణా సముద్రుడు రంగనాథం" అనుకొన్నాను

కొన్నాళ్ళకు రంగనాథం మా యింటికివచ్చి నా పరిచయానికి తన


**బి. గోపాలకృష్ణ**

ఇంజనీరింగ్ మూడవ సంవత్సరము,
ఇంజనీరింగ్ కాలేజి హాస్టలు "బి"
రూమ్ నెం. 23 రాయ్‌పూర్, (మధ్యప్రదేశ్)

సంతోషాన్ని వెలిబుచ్చేడు మాటల సందర్భంలో ఒకనాడు వేదాంతంధోరణిలో మాట్లాడాడు

"అంతా మాయ మానవుడు ఎన్నాళ్ళో యీ ప్రపంచంలో ఉట్టికట్టుకుని ఊగాళ్ళలాలని పగటికలలు కంటాడు ఆకాశంలో గాలిమేడలు నిర్మిస్తాడు, విధివశంవల్ల కథ అడ్డంగా తిరిగి సోమసుందరంగారి గతే ప్రాప్తిస్తుంది" అంటూ ముగించేడు

నా కర్థం కాలేదు

మరొకనాడు

"ఏ క్షణమందు మృత్యువు తన కరాళదంష్ట్రిలతో జీవితాన్ని చీల్చివేస్తుందో చెప్పలేము తానొకటి తలుస్తే దైవమొకటి తలుస్తాడు చూసేరా సోమసుందరంగారి జీవితం! ఎప్పుడైనా కల్లోనైనా అనుకొన్నాడా యీ విధంగా తనపైని ఆధారపడ్డ అభాయకులను నట్టనడి సముద్రంలో విడిచి పడతానని"

క్రమంగా తెలుసుకున్నాను రంగనాథం ఇన్సూరెన్సు ఏజెంటు అని ఆనాడు సోమసుందరం మరణానంతరం రంగనాథం యిచ్చిన వెయ్యి

---

# ఏ వూరు ఎవరిది [జవాబు]

రామయ్యది వెంకటాయపాలెం కృష్ణమూర్తిది రామాపురం వెంకటయ్యది కృష్ణానగర

రామయ్యది రామాపురంకాదు ఎందుకంటే మనిషిపేరు, ఊరిపేరు ఒకటి కాగూడదుగదా? అతనిది కృష్ణానగరం కూడా కాదు ఎందుకంటే కృష్ణానగరం నుంచి వచ్చిన పెద్ద మనిషి "ఈ విచిత్రం చూశారా?" అని అడిగితేనే రామయ్య "అవును నుమండీ" అని అంగీకరించాడు అందువల్ల అతనిది వెంకటాయపాలెం కావాలి అప్పుడు కృష్ణమూర్తిది విధిగా రామాపురం, వెంకటయ్యది కృష్ణానగరం అయితీరాలి

రూపాయలు సోమసుందరం తాలూకు ఇన్సూరెన్స్ పైకం.

తప్పని సరిగా అది మొదలుగా రంగనాథం ప్రతిరోజూ మా యింటికి రావడం, క్షణభంగురమైన జీవితం గురించి లెక్చర్లు ఇస్తూ నన్ను విసిగించడం పరిపాటి అయింది.

కొత్తగా పాలసీ తీసుకోడానికి నా ఆర్థికపరిస్థితి ఒప్పుకోదంటే నమ్మడు: నా ఆదాయ వ్యయాలు లెక్కవేసి, అందులో నెలకు కనీసం యాభైరూపాయలు మిగుల్చవచ్చని ఋజువు చేసేడు.

రంగనాథం బాధతప్పించుకుందికి నెల్లాళ్లు సెలవుతీసుకొని బంధువుల యింటికి పోయేను. అక్కడనాకెంతో మర్యాదచేసేరు. ఆ మర్యాద అతి మిక్కిలి కావడంతో నాకు కొంచెం భయంకలిగింది. ఒకనాడు మాబంధువు ఇలా అన్నాడు "బ్రదర్... చల్లకి వచ్చి ముంతదాచటం ఎందుకూ... సూటిగా అడిగేస్తున్నాను. నువ్వు అధమం ఐదువేలకి ... ఇన్సూరు చెయ్యాలి" అన్నాడు. నాగుండె గుభేల్మంది. తీవ్రంగా దాన్ని గురించి ఆలోగిస్తానని చెప్పి ఆ సాయంకాలమే సెలవుతీసుకొని పొరుగూరు వెళ్ళాను. అచ్చట తిరునాళ్ళు అవుతూంటే, దైవసందర్శనం చేసుకుందికి దేవాలయంలోకి పోయాను.

త్రోవలోనే పూజారి నా కెదురై నాకు బస యేర్పాటుచేసి భోజన సదుపాయాలు కల్పించి తన పనిమీద దేవాలయంలోనికి వెళ్ళిపోయేడు.

నాకు స్పెషల్‌గా దేవుని దర్శనానికి ఏర్పాటు చేశాడు. ఎంతో గౌరవించాడు. పొంగలి, దద్ధోజనం, పులిహోర పొట్లాలు కట్టించి నా లాడ్జికి స్వయంగా తీసుకువచ్చాడు. అవి ఆరగించి అతని ఆదరాభిమానాలకు అపరిమితానందం పొంది అభినందించాను.

"అంతా భగవద్విలాసం.. అంటూ మొదలు పెట్టాడు పూజారి. మాటల సందర్భంలో తన సంసారం బాధ్యతలు, ఆర్థిక దురవస్థ చెబుతూ హృదయం కరిగేలా తన బాధలు మొదలు పెట్టాడు.

దేవస్థానం యిచ్చే స్వల్పవేతనంతో సంసారసాగరం ఈదలేని తనకు భగవంతుడు మరొక అవకాశం కల్పించే దన్నాడు. నాకు అర్థం కాలేదు. వేరే సంచీలోనుంచి ఏవో కాగితాలు తీస్తూన్న చప్పుడు వినవచ్చింది. ధర్మం చెయ్యమని ఏదో లిస్టు తీస్తున్నా డనుకొన్నాను. కాని తీరా అతను తీసిన కాగితం మరొకటి.

"దయవుంచి ఈ క్రింద సంతకం పెట్టండి ... ఎక్కువ లేదు ... ఒక్క ఐదు వేలకే" ... అంటూ ముగించాడు.

***

# విడిపోయిన మంచుతెర

రెండవ బహుమతి [రూ. 25] కథ

'అబ్బా!... ...'

తూలి పడబోతూ నీరసంగా అంది శాంత. తలుపు దగ్గరనుండి భారంగా నడిచి సోఫాలో జేరగిల పడింది, ఆయాసంతో. అసలే గర్భవతి. సరియైన ఆహారం తిని ఎన్నాళ్ళయిందో పాపం! చాలా బలహీనంగా వుంది.

తలుపు శబ్దమైతే ఆశగా చూసింది శాంత.

'ప్చ్! ఊఁ...' నిట్టూర్చింది.

ఆయన-రఘు-ఇంకా రాలేదు. అంత తీరిక లేకుండా ఏమి పనులుంటాయో? మధ్యాహ్నం భోజనానికి కూడా రాలేదింటికి.

తలుపువంక చూచి గోడగడియారం వైపు తల తిప్పింది.

'అబ్బా! పదిన్నర అవ్వొస్తూంది. ఇంకా రాలేదు' కళ్ళల్లో నీరు తిరిగింది. ఇదేం క్రొత్త కాదు. మామూలుగా, దినచర్యలలో ఇది ఒకటి. — ఆయన కోసం కాచుకూర్చోటం, ఏ అపరాత్రో ఆయన వూడిపడటం అలవాటై పోయింది.

నిద్రకు తాళలేక తల వాల్చేసింది శాంత. నిద్రలో యెక్కడ వుహిస్తూందో, హఠాత్తుగా యెవరో కుదిపేసరికి భయంతో కెవ్వుమంది. ఏవో అరుపులు వినిపించేసరికి పూర్తిగా మత్తువదలి కళ్ళు తుడుచుకు చూసింది. రఘు కోప్పడుతున్నాడు - నిద్దరోతున్నందుకు

టేబిలుమీద అమర్చిపెట్టిన భోజనాన్ని మూడు నిమిషాల్లో అయిందనిపించి వెళ్ళి పడుకున్నాడు. భోజనం అయ్యేవరకు పనిగాడు శాంతకు దుఃఖం పొంగుకొచ్చింది

విజయకుమారి సాగర్
పి. యు. సి, కె. వి. ఆర్. జి ఉమెన్స్ కాలేజి, - కర్నూల్.

రోజూ ఈ ఛీత్కారాన్ని భరించ లేకుండా వుంది. ఎందుకో తనంటే, అంత విసుగు, నిర్లక్ష్యం, చీదరింపు. అవి చూస్తూ పని ముగించుకుని వెళ్ళి పడుకుంది.

వేకువనే శాంత లేచే సరికి రఘు దేనికో పనిదాన్ని తొందర పెడుతున్నాడు. అన్నీ అందించగా వెళ్ళిపోయాడు.

* * *

సాయంత్రం వచ్చిన రఘు ప్రవృత్తం ప్రశాంతం శాంతను వాటేసుకుని ఎత్తుకున్నంత పనిచేశాడు. శాంత నోటినుంచి ఒక్కమాట రాలేదు నిర్విణ్ణురాలైంది. దగ్గర కూర్చుని కబుర్లు చెప్పాడు- వాతావరణం ఉత్సాహం కలుగగా మార్చటానికి. సినిమాకు రెడీగా ఉండమన్నాడు, తాను తెచ్చిన బట్టల పొట్లంవిప్పుతూ. తనకు తెలియకుండానే అన్నిపనులు ముగించింది శాంత

సినిమాహల్లో అందరికీ దూరంగా కూర్చున్నారిద్దరూ. తన చుట్టూవున్న లోకాన్ని మరచి ఉత్సాహంగా కబుర్లు చెప్పేస్తున్నాడు రఘు. కాని శాంత ఆ లోకంలో లేదు. ఆమెకు అంతా కలలా వుంది. రఘు కళ్ళ లోని చూపు శాంతని కదిలించింది. రఘు ఎంత సంతోషంగా మాట్లాడుతున్నా ఆ చూపులో దీనత్వం వ్యక్తమవుతూంది. ఎందుకో అతనిచూపులు శాంత చూపులతో కలిసినపుడు విడి పోయి వాలిపోతున్నాయి. శాంత నమ్మలేకపోయింది. ఆనందం ఉధృతంగా పొంగగా హాయిగా కళ్ళు మూసుకుంది. రఘుకి ఏ అర్థం కాలేదు. శాంతకి ఒంట్లో బాగోలేదనుకుని

---

# పోటీదార్లకు మనవి

"జ్యోతి" చిన్న కథలపోటీకి రచనలు పంపే విద్యార్థినీ విద్యార్థులు గమనించవలసిన నిబంధనలు :-

1. కథలు "జ్యోతి"లో రెండు, మూడు పేజీలకు మించరాదు.

2. స్వకపోల కల్పితమైన స్వతంత్ర రచనలే పంపించాలి.

3. తమ పూర్తి పేరు, చదువుతున్న తరగతి, కాలేజి, లేక విశ్వవిద్యాలయం పేరుతో సహా తమ పూర్తి చిరునామా జతపరచాలి.

4. ప్రతి నెల 1వ తేదీ వరకు అందిన రచనలను ఆపై నెల సంచికలో పోటీ నిమిత్తం పరిగణిస్తాము.

5. బహుమతి పొందని రచనలు తిప్పి పంపబడవు. అందు చేత స్టాంపులు పంపించనక్కరలేదు. రచనల విషయమై ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు.

6. కవరుమీద, రచన మొదటి పేజీమీద "జ్యోతి చిన్న కథల పోటీకి" అని స్పష్టంగా వ్రాయాలి.

---

మధ్యలో ఇంటికి తీసుకుని వచ్చేశాడు.

* * *

"శాంతా! నన్ను క్షమించవూ?" దీనంగా కళ్లలోకి చూస్తూ అడిగాడు రఘు. "నిన్నెంతకష్టపెడుతున్నానో నేను గ్రహించలేక పోయాను కాని శేఖర్ ప్రవర్తన నాకళ్ళు తెరిపించింది మధ్యాహ్నం అర్జంటుగా రావాలని కబురొస్తే వెళ్లాను. నేవెళ్ళే సరికి ఫోం చేస్తూ సుధను కోప్పడుతున్నాడు. నేను పోబోతూ ఆగిపోయాను. ఇంతలో శేఖర్ కోపం పట్టలేక తింటున్న చేత్తోనే సుధను కొట్టి విసురుగా గదిలోంచి బయటికొస్తూ నన్ను చూసి గాభరా పడ్డాడు. కాని అంతలో తమాయించుకుని, నేను నిలదీసి అడిగిన ప్రశ్నకు సమాధానంగా నాస్థితే నాకు చూపాడు. శాంతా! నిన్ను అర్థం చేసుకోలేకపోయాను కాని, నాతోబుట్టువు అలా బాధపడటం చూడలేక పోయాను. అప్పుడే గ్రహించాను నీ స్థితి. అందుకే అంటారు తమదాకా వస్తేగాని తెలియదని."




ఆశ్చర్యంతో వింటూ నోటమాట రాకుండా వుండిపోయింది శాంత. "ఏమండీ! మీరింత తొందరగా మారుతారని అనుకోలేదు. మీరు చూసిన సంఘటన అంతా నటన. సుధ గట్టిదే. అన్నంతా చేసి నిరూపించింది. నేను నమ్మలేదు. కానీ... కానీ... అబ్బా! ఎంత హాయిగా వుంది" అని పైకి అందామనుకుని కూడా సాహసించలేక నిమీలిత నేత్రాలతో రఘు గుండెలమీదికి వాలిపోయింది శాంత. "నన్ను క్షమించానను శాంతా!" అంటూ రెట్టించాడు రఘు దీనంగా.

"మీరు నా అవస్థ తెలుసుకోవటం కంటే నేను క్షమించడమేమీ గొప్పకాదండీ" అంటూ రఘు తలను తన గుండెల కదుముకుంది శాంత— తన బిడ్డ ఎంతటి తప్పు చేసినా క్షమించగలిగే మాతృమూర్తిలా.

***

# కథలాంటి జీవితం

'ఏం టిలో వున్నారా ?'

ఆ పలకరింపుకి, వెనకకు తిరిగి చూసింది సావిత్రి. ఆ వీధి చివరనున్న పెద్ద భవనంలో నివసించే రాజేశ్వరిని చూసి గతుక్కుమంది సావిత్రి. సావిత్రి వుండేది చిన్న పెంకుటిల్లు. చుట్టూ ఆవరణకి కంచె, చెట్లు వున్నాయి. ఇల్లు లోపల అంతా చవుడు వారిపోయి, నేలంతా గచ్చూడిపోయి ఆ యింటి యజమాని దీనావస్థకి ప్రతీకలా వుంటుంది. అంత పెద్ద భవనంలో వుండే రాజేశ్వరి తమ ఇంటికి రావటం, సావిత్రికి ఆశ్చర్యాన్ని కలుగజేసింది. రాజేశ్వరికీ, సావిత్రికి మునుపెప్పుడూ పరిచయం లేదు. పరిచయం వుండటానికి ఎక్కడా అవకాశం లేదు. రాజేశ్వరికీ, సావిత్రికీ హస్తిమశకమంత తేడావుంది. సావిత్రి భర్తకి ఆ ఊరు బదిలీ అయి ఆరువారాలు అయింది. సావిత్రికి నలుగురు పిల్లలున్నారు. పది సంవత్సరాల పెద్దపిల్ల జానకి, తర్వాత ఏడేళ్ళు నిండబోతున్న బాబూ, నాలుగేళ్ళ వాడు నందూ, ఏడాది బుచ్చీనూ. బుచ్చీ పుట్టగానే శంకరం కళ్ళు తెరుచుకుని, ఆపరేషన్ చేయించుకున్నాడు. అయినా, నలుగురు పిల్లలతోటీ, శంకరాని కొచ్చే వందరూపాయలూ ఏమూలకీ చాలటం లేదు. సంసారం చాలా ఇరుకుగా నడుస్తోంది. సావిత్రి ఎంత పొదుపుగా ఖర్చుచేసినా, ఇంట్లో ఏదో ఒక సామాను, అవసరానికి లేకుండా నే పోతోంది. సావిత్రికి ఇరుగు పొరుగులతో కల్పించుకుని మాటలాడే స్వభావం కాదు. వంటా వార్పూ అయి, భోజనాలు అయిపోగానే, బియ్యం పప్పులూ బాగు చేసుకోవటమో, తన చిరిగిన బట్టలుంటే అవి చింపి, పిల్లలకి సరిపడేలా, పరికిణీలూ, చొక్కాలూ కుట్టటమో, చేసుకుంటూ కూర్చుంటుంది. ఊరి చివరగా వున్న ఆ ఇల్లు, వాళ్ళకి చాలా చౌకగా

ఐ. వి. యస్. అచ్యుతవల్లి

దొరికింది. అద్దె పది రూపాయలు మాత్రమే అవటంతో అది వాళ్ళకి మహాప్రసాదంగా వుంది. ఇంటి మీద పెంకులు చాలా కొద్దిగా వున్నాయి! అయినా, ఇంటికి నాలుగువైపులా పెద్ద పెద్ద మామిడి చెట్లూ, అరటిచెట్లూ వుండటంతో ఇంటి కప్పకి పెంకు లెగిరిపోయిన లోటు లేకుండా, వెలుతురు లేకుండా, ఆ ఇంటికి దిట్టమయిన కప్పు వున్నదనే భ్రాంతిని కలిగిస్తుంది. సావిత్రి ఇల్లు దాటిన తర్వాత అంతా చెట్లూ, చేమలూ, పొదలతో దట్టమైన బయలు ప్రారంభమవుతుంది. సావిత్రి వంటు ఇంటి గదినించి, మధ్య గదిలోనికి వచ్చింది. సగం చినిగిన చాప తెచ్చి వేసి, 'కూర్చోండి' అంటూ రాజేశ్వరిని మర్యాద చేసింది. రాజేశ్వరి స్తిమితంగా కూర్చుంది. వాళ్ళు కూర్చున్న చోటికి కొద్ది దూరంలో దూలానికి తాడుకట్టి పాత చీరని జోలెగా వేసి అందులో పడుకోబెట్టింది బుచ్చిని సావిత్రి. ఆ జోలె బరువుగా ఇటూ అటూ కదలసాగింది. రాజేశ్వరి కళ్ళు, ఆ జోలె మీద ఆగాయి.

"మీరీ ఇంటికి కొత్తగా వచ్చారా?" అంది రాజేశ్వరి.

రాజేశ్వరి తనింటికి ఎందుకు వచ్చిందో, తనలాంటి పేద ఇల్లాలితో, ఆమెలాంటి భాగ్యశాలిని పరిచయం చేసుకోవాల్సినంత సరదా, ఆమెకి ఎందుకు కలిగిందో తెలియక, మల్లాగుల్లాలు పడతూనే సావిత్రి,

"ఊఁ" అంది.

"మీ వారికి ఏంపని?" అంది రాజేశ్వరి

ఫలానా 'ఆఫీసులో క్లర్కు!' అంది సావిత్రి.

"మావారు ఐ. ఎ. యస్. ప్యాసయ్యారు. ప్రస్తుతం ఫారిన్ సర్వీస్‌లో వున్నారు! మీకు పిల్లలెంతమంది?" అంది రాజేశ్వరి.

"నలుగురు" అంటూ చిన్నబుచ్చుకుంది సావిత్రి. ఆమె భర్త పెద్ద ఆఫీసరయి విదేశాల్లో వున్నాడు! ఆమె గొప్పతనం తనకి తెలియచెప్పటానికి ఆ ఇల్లాలు పనిగట్టుకుని తన ఇంటికి వచ్చింది అని అనుకుంది సావిత్రి.

"నాకు ఒక్క అమ్మాయి! మూడేళ్ళుంటాయి. ఇంక వారం పదిరోజుల్లో మూడేళ్ళూ వెళతాయి తెల్లగా బొద్దుగా వుంటుంది మా పాప!" చెప్తూంటే రాజేశ్వరి కళ్ళు తళతళా మెరిశాయి! అక్కడే తచ్చాడుతూన్న 'నందు' రాజేశ్వరి కేసి చూశాడు! నందు కూడా పచ్చగా బొద్దుగా వున్నాడు!

"ఈ అబ్బాయి పేరేమిటి?" అంది రాజేశ్వరి నందుని చూసి.

ఆమె తన పేరు అడగటంతో "నందు"కి యెక్కడలేని సిగ్గూ



ముంచుకు వచ్చింది. రాజేశ్వరీ చేతులకున్న లెక్కలేనన్ని బంగారు గాజుల వైపూ, చెవులకీ ముక్కుకీ ధగధగా మెరుస్తూన్న వజ్రాల దిద్దులూ, ముక్కుపుడకల వైపూ, విస్ఫారిత నేత్రాలతో చూస్తూ - అచేతనంగా నిలబడిపోయిన జానకి పరికిణీ పుచ్చుకుని, జానకి వెనక్కు వెళ్లి నిలబడ్డాడు!

'నందగోపాలు'. ఈవిడ కెందుకీ అనవసరం గొడవ అన్నట్లు, గింజుకుంటూ చెప్పింది సావిత్రి.

'నందూ! అని పిలుస్తారనుకుంటాను; మా పాప పేరు రాధ! రాధీ అంటూను నేను' అంది రాజేశ్వరి.

సావిత్రి ఏమీ అనలేదు. రాజేశ్వరి కట్టుకున్న ఖరీదైన చీర, జాకెట్టు

వైపు చూస్తూ, ఆమె ఐశ్వర్యంతో తన లేమిని పోల్చి చూసుకుంటూ, బాధ పడసాగింది సావిత్రి!

"ఈ వీధి చివరనే మా ఇల్లు! చుట్టూ పూలతోటతో, మధ్యన మూడంతస్తులతో కనపడే ఆ తెల్లని మేడని ఇట్టే గుర్తు పట్టొచ్చును! మీకు వీలు అయినప్పుడు ఒకసారి రండి మా ఇంటికి!" అంది రాజేశ్వరి.

"అలాగేలెండి!" అంది సావిత్రి

"ఇవ్వాళ ఏం వండారు?" అంది రాజేశ్వరి. ఆమె అంత కలుపుగోరుగా మాట్లాడుతుంటే సావిత్రికి చిన్నతనం ఎక్కువగా వొచ్చింది.

"పప్పుచారు" అంది ముక్తసరిగా.

"అయ్యో! వట్టి పప్పుచారుతో ఎల్లా తింటారు మగవాళ్లు? మా ఇంట్లో అయితే ఇంక చూసుకోండి! పప్పుకాక ఒక పులుసుకూర, ఒక వేపుడుకూర, ఒక పెరుగు పచ్చడి ఒక పప్పు పచ్చడీ, మజ్జిగపులుసూ, రసం, అప్పడం, ఒక స్వీటూ, ఒక హాటూ ఇందులో ఏవి మానినాసరే, కంచం విసరికొట్టి విస్తరి ముందు నించి లేచిపోతారు. మా రాధికైతే మీగడున్న పెరుగుతో కలిపితేనే రెండు ముద్దలు తిన్న వైనం ముగిస్తుంది. లేకపోతే రోజల్లా చాక్లెట్లతోనూ, బోర్నవిటాతోనూ గడిపి వేస్తుంది" అంది రాజేశ్వరి.

జానకీ, బాబూ, రాజేశ్వరి చెప్తూన్న వంటకాల వివరాలకి, పెదాలు చప్పరించుకుంటూ కళ్ళు గుండ్రంగా చేసుకుని ఒకరి వైపు ఒకరు బిక్కగా చూసుకున్నారు! సావిత్రికి చిరాకేసింది! పిలవని పేరంటంగా తమ ఇంటికి వచ్చి, తనుకున్న ఆధిక్యతనీ, అర్థికపు అంతస్తునీ మాటిమాటికీ చెప్పుకుంటూంది ఏమిటి? ఈ స్వోత్కర్షని తను ఎట్లా విని భరించడం? చివరికి "జరుగుబాటులో వుంటాయిలెండి! అవన్నీ!" విసుగ్గా అనేసింది సావిత్రి.

రాజేశ్వరి ఆ మాట విన్పించుకోనే లేదు. తన మామూలు ధోరణిలో తమ ఇంటి గురించీ, ఇంట్లోవున్న ఖరీదైన ఫర్నిచర్ గురించీ, తనకున్న చీని చీనాంబరాల గురించీ, వజ్ర వైఢూర్యాల గురించీ, చాలాసేపు కబుర్లు చెప్పి చెప్పి చివరకు,

"మీ నందుని మా ఇంటికి పంపండి! మా రాధితో జతగా ఆడుకుంటాడు! ఇద్దరూ ఆడుకుంటూంటే చూడముచ్చటగా వుంటుంది!" అంటూ లేచి వెళ్ళింది

"అమ్మయ్య!" అనుకొంది సావిత్రి.

"నందుని వాళ్ళమ్మాయితో ఆడుకునేందుకు పంపాలట! ఆ మహారాణి కూతురు యువరాణికి, చెలికాడు కావాలి కాబోల్ను! వెధవగొప్ప!" అనుకొని రుంజుకుంది సావిత్రి.

"అమ్మా! నందూ నేనూ వాళ్ళింటికి వెళ్ళమా రేపు? ఆవిడ రమ్మన్నదిగా!" అంది జానకి.

'రమ్మన్నదని వెళ్ళిపోతా రేమిటి! చింకిచేటల్లా మొఖాలేసుకుని! అవిడేదో తన వైభోగం అంతా కొత్త వాళ్ళం మనకి తెలీదు కదా అని ప్రదర్శించటానికి రమ్మన్నది! వాళ్ళకీ మనకి స్నేహమేమిటి!" అంది సావిత్రి. జానకికి వెళ్ళాలని వున్నప్పటికీ తల్లి మందలింపుతో వూరుకుంది. ఏడేళ్ళ బాబు మటుకు అక్కా! వాళ్ళ రాధిని చూద్దామా! ఆ అమ్మాయికి "కీ" ఇచ్చే రైలు బొమ్మ వుందేమో" అన్నాడు.

నందు "రైలుకాదు! గుర్రం వుంది!" అని చూసినట్లు అన్నాడు

"మీ ముఖాలున్నాయి! నోరు మూసుకుని కూర్చోండి!" అసలే కోపంగావున్న సావిత్రి పిల్లల్ని గదమాయించింది.

ఆ తర్వాత ఇంచుమించు ప్రతి రోజూ, రాజేశ్వరి ఏదో ఒకవేళ సావిత్రి ఇంటికి వస్తూనే వుంది. రోజూ వాళ్ళ 'రాధి' చేసే అల్లరి, వాళ్ళాయన ఫారిన్‌నించి ఏరోప్లేన్‌లో పంపే ఆటబొమ్మల గురించీ చాలాసేపు కబుర్లు చెప్పేది. సావిత్రికి రోజురోజుకీ రాజేశ్వరి అంటే విసుగూ కోపం ఎక్కువ అవుతూనే వున్నాయి. అంత పెద్ద మేడలో రాజేశ్వరి, మూడేళ్ళరాధా, సర్వెంట్లూ తప్ప ఇంకెవళ్ళూ వుండరని విని ఆశ్చర్యపోయింది సావిత్రి.

"మీరుకూడా మీ వారితో ఎందుకు ఫారిన్ వెళ్ళలేదు?" అంది సావిత్రి ఒకసారి.

"ఎల్లా వెళ్ళేది? పెద్ద జమీలాంటి ఆస్తిపాస్తులు నావి! పెద్ద మేడా! అదీ! ఇవన్నీ వదులుకుని ఎల్లా వెళ్ళటం? ఇక్కడుండి చూడటానికెవరూ లేరు! మేము మళ్ళీ వచ్చిచేరేసరికి ఇక్కడ, మొహంజో

---

ఒకడు స్నేహితుడితో :- "మా బావగారు సూర్యకిరణాలు మీద పడగానే నిద్ర లేస్తాడు ఎటొచ్చీ ఆయన మంచం పక్కన కిటికీ పడమటి వేపున వుంది."

* * *

మొదటిసారిగా మద్రాసు వెళ్ళిన తెలుగాయన మౌంటు రోడ్డులో ఎల్. ఐ. సి. భవనంచూసి : "బాగా ఎత్తుగా వున్నట్టు కనిపించాలని అంత ఎత్తుగా కట్టా రనుకుంటాను."

---

దారో, హారప్పాలు మిగులుతాయి!" అంది రాజేశ్వరి.

ఆమెకి అసిమీదున్న కాంక్షకి విస్తుపోయింది సావిత్రి.

రాజేశ్వరివద్ద సావిత్రి పిల్లలు బాగా చనువయ్యారు. సావిత్రి, రాజేశ్వరి వచ్చేసరికి ఇంటిపనుల్లో వున్నా, జానకితో గచ్చకాయలు ఆడుకుంటూనో, పిల్లలకి కథలూ తమాషాలూ అవీ చెప్పి నవ్విస్తూనో కాలక్షేపం చేసేది. "మా యింటికి రమ్మని సావిత్రిని చాలాసార్లు ఆహ్వానించింది రాజేశ్వరి. కాని సావిత్రి వెళ్ళలేదు. బాబు అప్పుడప్పుడు రాజేశ్వరిని అడిగేవాడు.

"రాధిని తీసుకురా అత్తా?" అని. రాజేశ్వరి నవ్వేసి—

"అబ్బో! మా రాధి మేడ దిగదు. బలవంతంగా తీసుకువస్తే ఏడుస్తూ కూచుంటుంది! దానితో ఆడుకోవాలని ఉంటే మీరే రండి!" అనేది రాజేశ్వరిని పిల్లలు అత్తా, అత్తా అంటూ పిలిచేవారు. రోజూ బిస్కట్లో, పిప్పరమెంట్లో, బత్తాయిలో, జామపళ్ళో పిల్లల కోసం తెచ్చేది రాజేశ్వరి. సావిత్రి పిల్లలకి, రాజేశ్వరి ఒకరోజు రాకపోతే తోచేదికాదు.

"అమ్మా! ఈ రోజు రాజత్త రాలేదు! వెళ్ళి చూసి రామా!" అనేది పెద్దది, జానకి.

"రాకపోతే మన కొంపేం మునిగి పోలేదులే! అంత వెళ్ళి చూడాల్సినంత ఉపద్రవం ఆమెకేం రాదు. వెధవ దరిద్రగొట్టు పిల్లలు! కుక్కకి రొట్టెముక్కలు పసినట్లు, ఈ వెధవలకి ఆ మహాతల్లి ఇంత మేత పడేయడంతో, తిండికి మొహంవాచి వున్న మేళాం కనుక, ఒక్కరోజు రాకపోతే గింజుకుపోతు న్నారు! నేను వారమేసి రోజులు, జ్వరంవచ్చి లంఖణాలు చేస్తూ, వీళ్ళ ముఖాన వండి వార్చి పెట్టినా, అమ్మా! ఎట్లా వుందే జ్వరం అని ఒక ముక్క అన్నా అడిగే దానివి కాదు! దారినపోయే దాని కోసం తహ తహ లాడిపోతున్నారు పాపం! మీ రంతా!" అంటూ, చివాట్లు వేసేది సావిత్రి! తన తల్లికి, రాజేశ్వరి అంటే ఎందుకు గిట్టదో అర్థమయ్యేది కాదు జానకికి!

ఒకసారి, నాలుగయిదు రోజులు వరసగా రాలేదు రాజేశ్వరి! పిల్లలు తహతహ లాడిపోయేరు ఏమయితే అయ్యిందని, తల్లి వంటగదిలో వుండగా, 'బుచ్చి' ని చీరజోలెలో పడుకోబెట్టి, వీధితలుపుల చేరవేసి, జానకి తమ్ముళ్ళిద్దర్నీ తీసుకొని రాజేశ్వరి ఇంటికి వెళ్ళింది. గేటు లోంచి ఇంటికి అరఫర్లాంగు దూరం దాకా, పెద్ద పూలతోట వుంది. మేడ వరండాదాకా కారు వెళ్ళ టానికి వీలుగా, సిమెంటు చేయబడి వుంది. జానకికి ఆ పూలతోట చూడగానే బ్రహ్మానంద మయింది. ఎన్నో రంగు రంగుల పూలు, వింత




వింత వాసనలతో చిరుగాలులకి తలలూపుతూ ముచ్చటు గొల్పుతున్నాయి "నందూ" దోసెకునిండా విరిసిన నీలిరంగు "జినియా" ని కోసేసి,

"ఎంత పెద్ద పువ్వో" అంటూ సంబరపడిపోయేడు. ఆ పూల తోటని చూస్తూ చూస్తూ నెమ్మదిగా వరండా వద్దకి వచ్చింది జానకి. బాబు, నందూ ఆ పూల తోటలో తీర్చి దిద్దినట్లున్న సన్నని కాలిదారి వెంబడి నడుస్తూ, మధ్య మధ్య వున్న ఫౌంటెన్లలోంచి వచ్చే నీటి ధారలని చూస్తూ, తోట మధ్యకు వెళ్ళిపోయారు. వరండాలో ఒక ముసలమ్మ కూర్చుని కునికిపాట్లు పడుతోంది.

జానకి "మామ్మా మామ్మా! రాజేశ్వరమ్మగారున్నారా?" అని అడిగింది. ముసలమ్మ ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. ఒక్కసారి ఆవలించి చిటికె వేసి—

"ఎవరమ్మా నువ్వు!" అంది ముసలమ్మ.

"నేను ఆ చివరి టివాళ్ళ అమ్మాయిని! అత్తయ్యగారు లేరా?" అంది జానకి.

"ఉన్నారు, వున్నారు. లోపలికి వెళ్ళు" అంటూ మళ్ళీ ఒక్కసారి ఆవలించి, చిటికె వేసి జోగటం మొదలెట్టింది. జానకి బెరుకు బెరుకుగా లోపలికి వెళ్ళింది. హాలులో ఒక నౌకరు ఏదో పనిచేస్తున్నాడు.

"అత్తయ్యగారెక్కడున్నారూ?" అని అడిగింది.

"ఆ లోపల గదిలో వున్నారు, వెళ్ళు" అన్నాడు.

విశాలమయిన ఆ హాలుకి ఇరు

వైపులా గదులున్నాయి. అటు ఆరూ, ఇటు ఆరూ గదులున్న పొడవైన హాలది! పైన రంగురంగుల దీపాల షాండిలియర్ వ్రేలాడుతూంది! గదులు అన్నిటికీ అందంగా ఎంబ్రాయిడరీ చేసిన కర్టెన్లు వ్రేలాడుతున్నాయి. విశాలంగా పొడుగ్గా వున్న ఆ హాలులో ఖరీదయిన తివాసీ పరుచబడి వుంది. నౌకరు చూపించిన గదిలోనికి కర్టెను తొలగించుకుని వెళ్ళింది జానకి. ఎత్తయిన పందిరి పట్టెమంచంమీద, వత్తిగిలి పడుకుంది రాజేశ్వరి! దోమతెర పందిరిమీదికి ఎత్తేసి వుంది! ఆ గది కూడా విశాలంగా వుంది. ఒక ప్రక్క స్టాండు వుయ్యాల వుంది. ఇంకో ప్రక్క నిలువెత్తు బీరువా వుంది. దాని నిండుగా, రకరకాల బొమ్మలున్నాయి బీరువా గాజు తలుపుల్లోంచి ఆ బొమ్మలు జానకికి కన్పించి మురిపించాయి. జానకి ఆసక్తిగా ఆ బొమ్మలవైపు చూస్తూ మంచం వద్దకు నడిచి,

"అత్తయ్యగారూ?" అంది మృదువుగా. రాజేశ్వరి కళ్ళు తెరిచింది.

"ఎవరూ నువ్వా!" అంటూ, లేచి మంచంమీద కూర్చుని,

"దా! నువ్వొక్కర్తివే వొచ్చావా! అమ్మగారు కూడా వొచ్చారా!" అని అడిగింది

"నేనూ తమ్ముళ్ళూ వొచ్చాం! పడుకున్నారేం అత్తయ్యా!" అంది జానకి.

"తమ్ముళ్ళేరీ!" అంది రాజేశ్వరి.

"తోటలోకి పరిగెత్తారు! పడుకున్నారేం?" అని మళ్ళీ అడిగింది జానకి

"వంట్లో బాగాలేదు తల్లీ! లేపద! ఇల్లంతా చూద్దువుగాని! తమ్ముళ్ళని పిలు!" అంటూ నెమ్మదిగా లేచింది రాజేశ్వరి

"మీ రాధెక్కడ అత్తయ్యా!" అంది ఉయ్యాలవైపు చూస్తూను.

"రాధి మేడమీద వుంది" అంటూ హాలులోనికి దారి తీసింది రాజేశ్వరి. బాబు, నందూ తోటంతా తిరిగి తిరిగి చేతికి అందినన్ని పూలూ, పళ్ళూ తెంపుకుని, హాలులోనికి వొచ్చారు.

రాజేశ్వరి పిల్లలకి కోవాబిళ్ళలు, చాక్లెట్లూ తెచ్చి ఇచ్చింది. నందూ—

"రాధేది అత్తా?" అన్నాడు.

"మేడమీద నిద్రపోతోంది! పదండి. తోటలో ఆడుకుందురుగాని" అంటూ తోటలోనికి దారి తీసింది రాజేశ్వరి.

"రాధిని చూపించండి అత్తా!" అన్నాడు బాబు.

"అది నిద్రపోతూ వుంటుంది. లేపితే తిక్కపెట్టి ఏడుస్తుంది. రేపు రండి చూద్దురుగాని" అంది రాజేశ్వరి

చీకటి పడ్డాక బితుకు బితుకు మంటూ వొచ్చిన పిల్లలని చూసి మండిపడింది సావిత్రి.

"ఏం మునిగిపోయిందని అక్కడకు పోయేరు ?" అంటూ పిల్లలని చావబాదింది. నందూ జేబులనిండా వున్న చాక్‌లెట్లు తల్లికిచ్చి-

"బుద్ధీకి దాచమ్మా" అన్నాడు.

పిల్లలు ఆమె పెట్టే బిళ్ళలకీ, బిస్కట్లకీ వాచిపోయి దేవిరింపుగా వాళ్ళింటిచుట్టూ తిరుగుతున్నారని బాధపడుతుంది సావిత్రికి

సావిత్రీ చూసీ చూడకా నందూ, బాబూ, రాజేశ్వరి ఇంటికి రాకపోకలు సాగించారు. కాని వాళ్ళు ఎన్నిసార్లు అడిగినా రాజేశ్వరి మటుకు "రాధ"ని ఆ పిల్లలతో ఆడుకునేందుకు మేడ దిగనిచ్చేది కాదు. దానితో ఆ పిల్లలకి ఆమె పెట్టే తినుబండారాలమీది ఆపేక్షకన్న, రాధని ఎలాగయినా తను జట్టులోకి లాక్కుని ఆడుకోవాలనే తపన హెచ్చిపోయింది.

ఒకరోజు ప్రొద్దుటే ఆర్భాటంగా వచ్చింది రాజేశ్వరి.

"వదినా ఏం చేస్తున్నారు !" అంటూ. రేషన్ బియ్యంలో గెడ్డలు ఏరుతూకూర్చున్న సావిత్రి -

"మామూలుపనే! ఏమిటీ విశేషం ప్రొద్దుటే వొచ్చారు ?" అంది.

"విశేషమే! రేపు మా రాధ పుట్టినరోజు! తప్పక మీరంతా సాయంకాలం పేరంటానికీ, రాత్రి విందుకూ, రావాలి! మీ రెప్పుడూ మా ఇంటికి రానేలేదు! పిల్లల్ని తీసుకుని తప్పక రండి!" అంటూ బంగారు కుంకుమ భరిణలోంచి కుంకుమ తీసి బొట్టు పెట్టింది రాజేశ్వరి చీరంతా జరీ పువ్వులతో, పట్టుతో నేసిన చీర కట్టి, దోసెడు వెడల్పు జరీఅంచువున్న రవిక తొడిగింది రాజేశ్వరి! బంగారం ముద్దలా వున్న ఆ చీరమీద, ఆమె ధరించిన ఆభరణాలు వెలవెలా బోతున్నాయి! పచ్చగా, బొద్దుగా, పొడుగ్గావున్న రాజేశ్వరి, చెంపకు చారెడేసి కన్నులతో, రాజరాజేశ్వరీ దేవి మూర్తిలా వుంది! ఆ అలంకరణతో ఒక దేవ ప్రతిమ సజీవంగా తన కన్నులముందు నిల్చినట్లు భావన వచ్చింది సావిత్రికి ! ఆ భాగ్యదేవతని చూడగానే సావిత్రికి ఇన్ని రోజులుగా పేరుకుంటున ఈర్ష్యాద్వేషాలు మంచులా కరిగిపోయాయి! తొలిసారిగా రాజేశ్వరిలో ఒక విధమైన దైవత్వాన్ని చూడ గలిగిన సావిత్రి మనస్సు

---

ఒక ఇల్లాలు పేరంటానికి వెళ్ళింది.

నలుగు రైదుగురి కంటే పేరంటాళ్ళు రాలేదు అవిడ మొహం చిట్లించి పక్కావిడతో అన్నది "ఇంత తక్కువ మంది వస్తారని తెలిస్తే ఈ కొత్త పట్టుచీర కట్టుకుని వచ్చేదాన్నే కాను"

రాజేశ్వరిపట్ల భక్తి భావంతో నిండి పోయింది.

"కూర్చోండి!" అంటూ అక్కడున్న పీట వాల్చింది సావిత్రి.

'కూర్చోను! ఇంకా బోలెడు మందిని పిల్చుకురావాలి! ముందు మీ ఇంటికే వచ్చాను. మీరు మటుకు తప్పక రావాలి' అంటూ వెళ్ళిపోయింది. కళ్ళు చీకట్లు కమ్మాయి సావిత్రికి. ఇంతసేపూ ఒక అపూర్వమైన సౌందర్య దృశ్యం ఆమె కళ్ళని ఆకట్టింది. ఆ దృశ్యం అదృశ్యమవగానే ఆ వెలుగు మాయమయి ఆ కళ్ళు చీకటిని చూడలేక పోయాయి. గట్టిగా కళ్ళు మూసుకుంది సావిత్రి.

మర్నాడు ప్రొద్దుటినించీ పిల్లల హడావిడి ఇంతా అంతా కాదు. జానకి బట్టలసబ్బు తెచ్చి మాసిపోయిన పావడా, జాకెట్టు వుతికి ఆరేసుకుంది.

సావిత్రి భర్తని అడిగి రెండు రూపాయలు తీసుకుంది — చిట్టి రాధకి ఏదన్నా బహుమతి కొనాలని! రెండు రూపాయలకి ఏమి వస్తాయా అని ఆలోచించింది. చిన్న గౌను కొందామన్నా, గౌనుకి సరిపడ గుడ్డ కొందామన్నా, రెండు రూపాయలకి మంచి రకం రావు! పైగా మూడేళ్లు నిండబోతున్న రాధ ఎంత వుంటుందో తామెవ్వరూ చూడలేదు! మాటిమాటికీ తమ పిల్లలకి బోలెడు తినుబండారాలూ, ఆట సామాన్లూ తెచ్చి ఇచ్చే రాజేశ్వరి ఏకైక పుత్రికకి ఏదో మంచి బహుమతి ఇవ్వకపోతే ఎట్లా? భోజనాలయినాక పిల్లలని ఇంట్లో వుండమని చెప్పి తను ఎదురింటికి వెళ్ళింది సావిత్రి.

ఎదురింటి "వెంకటమ్మ"తో ఈ మధ్యే, వీధి కుళాయివద్ద పరిచయమయిందిసావిత్రికి. వెంకటమ్మదికూడా సావిత్రిలానే, మధ్యరకం సంసారం! ఒకళ్ళ ఈతిబాధలు ఇంకొకళ్ళకి బాగా తెలియటంతో, కొద్దికాలంలోనే ఆప్త మిత్రురాళ్ళయ్యారు! వెంకటమ్మది ఆవూరే స్వంతవూరు కావటంతో ఆ వూళ్ళోవున్న వాళ్ళ గుట్టుమట్టులన్నీ బాగా తెలుసును ఆమెకి!

"రాజేశ్వరిగారు పేరంటానికి పిలిచారు అక్కయ్యా! నా వద్ద రెండు రూపాయలున్నాయి! ఏం కొంటే బాగుంటుందంటావు? మా జానకేమో యాపిలుపండు కొని ఇద్దామంది! ఒక్క పండుకొని ఇస్తే బాగుంటుందా? కనీసం అరడజను పళ్ళేనా కొనాలి! అయినా ఆ పాపకి యాపిలుపళ్ళకేం తక్కువా? రోజుకి బోలెడు పళ్ళుకొంటారు వాళ్ళమ్మ" అంది సావిత్రి. వెంకటమ్మ బోళాబోళా నవ్వింది. సావిత్రి తెల్లబోయింది. చిన్నబుచ్చుకుని —

"ఆట సామాను కొందామన్నా ఆ రాధకి బీరువాలతో వున్నాయట ఆటసామాన్లు. అవి కూడా బోలెడు ఖరీదులు. ముష్టి రెండు రూపాయ

బోలెడు ఆట సామాన్లు వస్తాయి! అసలే కరువు మండిపోతుంటేనూ?' అంది సావిత్రి.

"పిచ్చిపిల్లా!" అంది వెంకటమ్మ.

"ఆ రాజేశ్వరి పాపకి మన మేమీ బహుమతులు ఇవ్వక్కర్లేదు" అంది వెంకటమ్మ.

"బాగుంటుందా అక్కయ్యా!" అంది సావిత్రి.

"అసలు రాజేశ్వరికి కూతురుంటే గదా! మనం బహుమతులు ఈయటానికి!" అంది వెంకటమ్మ.

"కూతురేలేదా?" అంది ఆశ్చర్యంగా సావిత్రి

"పాపం! రాజేశ్వరి తల్లీతండ్రులకి ఒక్కర్తే కూతురుట! ఆ ఆస్తి అంతా, రాజేశ్వరి పుట్టింటివాళ్లదే! చిన్నప్పుడే పేదఇంటి పిల్లవాణ్ణి తెచ్చి రాజేశ్వరినిచ్చి పెళ్ళిచేసి, అతనికి చదువు సంధ్యా చెప్పించారు! అతను చదువులో అన్ని క్లాసుల్లోనూ ఫస్టుగా ప్యాసయ్యాడు! ఫారిన్ ఛాన్స్ వచ్చింది. రాజేశ్వరి తల్లీతండ్రులు వద్దన్నా వినకుండా వెళ్లిపోయాడు! ఈలోగా రాజేశ్వరి తల్లితండ్రులు పోయేరు! రాజేశ్వరి భర్త ఫారిన్ వెళ్ళేసరికి, రాజేశ్వరి యెనిమిది నెలల గర్భవతిగా వున్నదిట! భర్తని దూరదేశాలకి వెళ్ళవద్దని యెంత బ్రతిమిలాడినా వినకుండా అతను వెళ్లిపోవటంతో ఏకాకిగా మిగిలిపోయిన రాజేశ్వరి బెంగపెట్టుకుని జబ్బు పడింది. ఆ జబ్బులోనే రాజేశ్వరికి పురుడయింది. సిరసించి పుట్టిన పిల్ల దక్కలేదు. దూరదేశాల్లో వున్న భర్త క్రమంగా ఆ దేశమే నచ్చిపోవటంతో అక్కడి 'స్త్రీ'ని ఎవరినో వివాహమాడి అక్కడనే స్థిరపడిపోయాడు. దానితో రాజేశ్వరికి మతి చలించిపోయింది. అతను రాజేశ్వరిని కూడా మరో వివాహం చేసుకోమని వ్రాశాడుట! అయినా, రాజేశ్వరి మరో వివాహం మాట తలపెట్టలేదు" విచారంగా అంది వెంకటమ్మ.

"అయితే ఇప్పుడీ పేరంటం ఎందుకు చేస్తోంది? ఇదిజరిగి ఎన్ని రోజులయింది?" అంది సావిత్రి.

"పది పదిహేనేళ్ళు కావస్తోంది! అప్పుడప్పుడు ఇల్లా ఆమెకి తోచక, పేరంటం చేస్తూవుంటుంది! ఎన్ని రోజులు గడిచినా తన కూతురికి ...ఏడేళ్ళు నిండి, నాలుగో ఏడు వస్తుందనే చెబుతుంది! అదొక మానసిక వ్యాధి! పాపం!" అంది వెంకటమ్మ.

"పేరంటంలో ఏ పిల్లని కూచో బెట్టుందీ!" అంది సావిత్రి జిజ్ఞాసగా.

"ఆమె దగ్గర పెద్ద రబ్బరుబొమ్మ వుంది! దానిని కుర్చీలో కూర్చోబెట్టి హారతిస్తుంది! ఆ బొమ్మనే రాధి, రాధి — అని పిలుస్తుంది. పేరంటానికి వచ్చిన వాళ్ళు తెలిసిన వాళ్ళయితే పాపం ఆమె స్థితికి జాలిపడతారు! కొత్తవాళ్ళు తెలియక విస్తుబోతారు!" అంది వెంకటమ్మ.

"పోనీ ఎవరినన్నా పెంచుకో కూడదా ?" అంది సావిత్రి.

"ఆ సలహా ఎవరన్నా చెప్పారంటే, ఆమెకి కోపం వస్తుంది! నేనేమన్నా గొడ్రాలునా పెంచుకోటానికి! అంటూ దుమ్మెత్తి పోస్తుంది! వాళ్ళ ముఖం ఇంక చూడనైనా చూడదు!" అంది వెంకటమ్మ!

"పాపం! అదొక పిచ్చి! ఆమెకి!" అనుకొంటూ ఇంటికి వచ్చింది సావిత్రి. రాజేశ్వరిపట్ల ఇరవై నాలుగు గంటలక్రితం కల్గిన భక్తి భావంతోపాటూ, జాలీ సానుభూతీ కూడా కలిగాయి సావిత్రికి!

"రాధికి ఏం కొన్నావే అమ్మా!" అని అడిగిన పెద్దపిల్ల జానకి ప్రశ్నకి సావిత్రి ఏం మాట్లాడలేదు.

పిల్లలు మటుకు 'రాధి'ని చూడాలనే ఉత్సాహంతో ఉరకలు వేస్తూ, రాజేశ్వరి ఇంటివైపు పరుగులు తీశారు!

***

# గొలుసు లెక్కకు జవాబు




90 పైసలు. ఇంతకంటె తక్కువ ఖర్చుతో పెద్ద గొలుసు తయారు కాదు. అయిదు చిన్న గొలుసులలోను మొదటిదాన్ని తీసుకొని, దాని లోని మూడు లింకులను విడదీయించండి అక్కడికి 30 పైసలయింది.

అలా విడదీసిన లింకులతో మిగతా నాలుగు గొలుసులను-ఒక్కొక్క లింకుతో రెండేసిగొలుసుల చొప్పున-కలిపి అతికించండి. అంటే మూడు సార్లు అతకాలి. మూడు ఇరవైలు 60 పైసలు ఇందాకటి 30 తో కలిపి మొత్తం 90 పైసలు.

# కిశోర ప్రాయం

## విజయలక్ష్మి రామకృష్ణన్

(ఉన్నవ విజయలక్ష్మి)

(గత సంచిక తరువాయి)

ఏమా తల్లిదండ్రులు, తోబుట్టువులు ఎవరూ రాలేదేమి" అని అడిగాడు రాఘవరావు. "వాళ్ళెందుకు లెండి" అన్నాడు చూడవచ్చిన పెళ్ళికొడుకు. అతని పేరు ప్రసాదు. ఆ అబ్బాయితో వాసు మాట్లాడుతూ కూర్చున్నాడు. వసంత తనే ప్రింటు చేసుకున్న 'బాటిక్' డిజైన్ చీర కట్టుకుంది. ముత్యాలు, పగడాలు కలిసిన కమ్మలు, గాజులు, నెక్లెస్ పెట్టుకుంది. మగవాళ్ళు మాట్లాడుకుంటుండగా జానకి వసంతను వెంటపెట్టుకు వచ్చి కూర్చుంది.

"ఈమె మా అన్నగారమ్మాయి వసంతలక్ష్మి. ఈ యేడే బి. ఏ. పూర్తిచేసింది. మద్రాసులో స్టెల్లా మేరీస్‌లో చదివింది" అని ప్రసాదుకు వసంతను పరిచయం చేసింది జానకి. ప్రసాదు, వసంత ఒకరినొకరు క్షణం చూసుకున్నారు.

"ఎంత అందంగా వున్నాడు" అనుకుంది వసంత. మరో ఐదు నిమిషాలకు అనంత ఫలహారాలు, టీ పట్టించుకు వచ్చింది వంటమనిషితో. అందరి ముందర ప్లేట్లు పెట్టింది. "టీ మా అక్క బాగా కలుపుతుంది" అంటూ కెటిల్ వసంత ముందుకు జరిపింది. వసంత కప్పుల్లో టీ కలిపింది ఎవరికి ముందు ఇవ్వాలో తెలియక మెదలకుండా వుండిపోయింది. అది గ్రహించిన వాసు తనే అందరికి కప్పులందిం

చాడు. ప్రసాదు ఆడవాళ్ళెవరితోటీ మాట్లాడలేదు. రాఘవరావు, నారాయణరావు అడిగిన ప్రశ్నలకు క్లుప్తంగా జవాబులు చెప్తూ వాసుతోనే నవ్వుతూ హుషారుగా మాట్లాడాడు అంత సేపు. టీ త్రాగిన పదినిమిషాలకు వెళ్తానంటూ లేచాడు. వచ్చిన టాక్సీలోనే వెళ్ళి పోయాడు.

తెల్లగా, దృఢంగా, ఎత్తుగా వున్నాడు. పొట్టిగా కత్తిరించిన జుట్టు, తేనెలూరే చిన్న కళ్ళు, పెద్ద చెవులు, చెక్కినట్లున్న ముక్కు, ఎప్పుడూ నవ్వుతున్నట్లు కనిపించే పెదవులు, గర్వంగా కాస్తంత ముందుకు వచ్చిన గడ్డం — గ్రీకు శిల్పంలాగా వున్నాడు ప్రసాదు.

అతడు వెళ్ళిపోయాక 'చూడ్డానికి దొరలాగా వున్నాడు. తల్లి, తండ్రి, తోడు అందరు వున్నారు వసంత పూజ మంచిదే' అన్నది జానకి. 'ఏ తిక్కైనా పుట్టి ఉద్యోగం వది లేసినా గింజుకు లోటులేకుండా కాస్తంత మాగాణీ వుంది. అందుకే నాకు నచ్చిందీ సంబంధం' అన్నాడు రాఘవరావు. 'బాగా తెలివైన వాడులా కనిపించాడు' అన్నాడు నారాయణరావు. 'చాల స్మార్ట్ అండ్ పాలిష్డ్' అన్నాడు వాసు. 'ఎంతో బాగున్నాడు కదూ అత్తయ్యా' అన్నది అనంత. ఏమీ మాట్లాడనిది వసంత ఒక్కతే. ఆ మర్నాడు రాఘవరావు వెళ్ళిపోయాడు. వసంత బందరులోనే వుండిపోయింది.

ఇంట్లో ఎప్పుడు వసంత ఎదురయినా వాసుకు ప్రసాదు గుర్తుకు వచ్చేవాడు. ఒక వారమయ్యాక సంబంధం తీసుకువచ్చిన మధ్యవర్తి వచ్చాడు. 'పిల్ల నచ్చిందట, అయితే ముప్ఫయి వేలు మరీ తక్కువ అంటున్నాడు పెళ్ళి కొడుకు తండ్రి' అన్నాడు. అందరు నిర్ఘాంతపోయారు. తెముల్చుకుని 'ఆ అబ్బాయి యేమన్నాడు' అనడిగాడు వాసు. 'అబ్బాయిదేముంది లెండి పిల్ల బాగానే వుందన్నాడట. కాకపోతే స్టయిలిష్‌గా వుంది, నాకు వచ్చే జీతంలో సగం ఆమె మేకప్ ఖర్చుకే సరిపోతుందేమో' అన్నాడట. 'హరి అపాశ్చాత్యుడా' అన్నాడు నారాయణ రావు. 'అప్రాచ్యుడైతే అట్లా అని వుండడు వీడు పూర్తిగా ప్రాచ్యుడు లాగున్నాడు' అన్నాడు వాసు.

'సరే— యింకేదైనా చూడండి — ఇహ ఇది కుదరదులెండి' అన్నాడు నారాయణరావు మధ్యవర్తితో. 'మనిషిని చూసి మోసపోవడం అంటారు, ఇదే కాబోలు! ఇంతకీ అన్నీ మనం అనుకున్నట్లు జరగవు.

**సీరియల్**

అన్నయ్య వుసూరు మంటారు" అంది జానకి.

అక్కను చేసుకుంటాడను కున్న ఆ అందగాడు తనకేమీ కాబోడనుకుంటే దిగులయింది



అనంతకు. దిగులుగా అక్క వంక చూసింది. వసంత ముఖం పాలి పోయింది. సంబంధం తప్పినందుకు ఆమె బాధ పడలేదు. కట్నం మరి కాస్త అడిగినందుకు అసహ్య పడ లేదు. తన సౌందర్యాన్ని అవమా నించినట్లు భావించలేదు. కాని తన మేకప్ గురించి అందరితోటీ అన్న ప్రసాదు అల్ప బుద్ధి ఆమెను బాధించింది. తనేమీ విపరీతంగా అలంకరించుకోలేదని ఆమెకు తెలుసు. సింపుల్‌గా నైనా అధునాత నంగా కనబడ్డం ఆమె కిష్టం. "దానికి ఇంత రాద్ధాంతమా" అనుకుంది.

"పోనీలెద్దురూ, పాత చింతకాయ కోసం బెంగపడ్డం దేనికి" అన్నది అనంత. అందరూ నవ్వారు. వాతా వరణం తేలికయింది. మధ్యవర్తి వెళ్ళిపోయాడు. మళ్ళీ వారం తిరక్కుండా రాఘవరావు యింకో సంబంధం పట్టుకొచ్చాడు. షెళ్ళి కొడుకు డాక్టరు ఆఖరు సంవత్సరం

చదువుతున్నాడట. తండ్రికి బాపట్లలో కలప వ్యాపారమట. ఈసారి తలుపుల తెరలు మార్చలేదు. ఇల్లు బూజు దులపలేదు. పెళ్ళి కొడుకు తల్లి తండ్రికూడా వచ్చారు. స్టేషన్ కు కారు తీసుకువెళ్ళాడు రఘువరావు రాగానే వాళ్ళను మొదట చూచింది అనంత పెళ్ళి కొడుకును చూడగానే షాక్ వచ్చి నట్లయింది అనంతకు. ముట్టుకుంటే అంటుకునే నలుపు!

"భగవంతుడా, ఇతడా నాకు బావ కాబోతాడు? వద్దు, అక్కకు పెళ్ళి కాకపోతే ఫరవాలేదు" అనుకుంది. టీ, ఫలహారాలు వంటమనిషితోనే పంపింది. అనంతకు వెళ్ళబుద్ధి కాలేదు. తన గదిలోనే వుండిపోయింది. తలాతోకా లేని సంభాషణ తర్వాత వచ్చినవాళ్ళు వెళ్లారు. ఎవరికీ ఆసక్తి లేకుండా వుంది ఒక్క రాఘవరావుకు తప్ప. వానుకు ఒళ్ళంతా మంటగా వుంది. వసంత ప్రక్కన ఆ పెళ్లికొడుకును వూహించుకో లేక పోతున్నాడు నిశ్శబ్దాన్ని భరించలేక అనంత "ఛీ, అట్లావున్నాడేమిటి బాబూ, నాకు నచ్చలేదు" అన్నది.

అంతా తెలబోయి చూచారు. రాఘువరావు "నచ్చాలిసింది నీకు కాదుగా! అందగా వున్నవాడు ఎంత సంస్కారవంతుడో చూశాంగా" అన్నాడు.

వసంత "నాకు అభ్యంతరంలేదు" అన్నది.

పిడుగు పడ్డట్లయింది అనంతకు. అందరూ వసంత వంక చూశారు. వసంత ముఖం భావరహితంగా వుంది. నారాయణరావు నిట్టూర్చాడు మూడవనాటికి కబురు తీసుకు వచ్చిన మధ్యవర్తి మాటలు విని అంతకన్నా రాఘవరావు రుద్రుడయ్యాడు ఆ అబ్బాయి పరీక్ష ప్యాసయ్యాక ఉద్యోగం చెయ్యడట. బాపట్లలోనే ప్రాక్టీసు పెట్టుకుంటాడట అందుకు కనీసం అరవై డెభై వేలయినా కావలసి వస్తుందట. అమ్మాయి తల్లిలేని పెంపకం, అందులో మద్రాసులో హాస్టల్లోవుండి పెరిగిన అమ్మాయి. అందుచేత పెళ్ళి కొడుక్కు, అతని తల్లికి అంతగా యిష్టం లేదట. అయినా అరవై వేలయితే "అబ్బాయికి నేను నచ్చచెప్తాను" అన్నాడట పెళ్ళికొడుకు తండ్రి. "లబ్బులు, వెధవలు" అని మండిపడ్డాడు రాఘవరావు. నారాయణరావు ఏమీ మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

నిజానికి ఆరోజు వసంత తన కభ్యంతరం లేదని చెప్పినపుడు బాధ పడినంతగా ఇవాళ సంబంధం వెనక్కి పోయినందుకు ఎవరూ బాధ పడలేదు ఏ భావమూ లేకుండా జానకి "దిగులు పడకండి అన్నయ్యా, ఇంతకీ కళ్యాణ ఘడియ రావాలి" అన్నది. సంబంధం కాకుండా పోయినందుకు మనస్ఫూర్తిగా

అనందించింది అనంత. ఈ సంబంధం కూడా తప్పించదనుకున్న తర్వాత వసంతను చూసినప్పుడల్లా వాసుకు జాలాంటి భావమేదో ముంచుకు వచ్చేది!

రాత్రి అందరూ భోంచేస్తుండగా నారాయణరావు "ఇప్పటికి యిహ ఏమీ తలపెట్టకుండా వసంతను యం. ఏ కు పంపించు రాఘవా! రెండేళ్ళయ్యాక మళ్ళీ మాసుకో వచ్చు" అన్నాడు. "చాల్లేవయ్యా చెప్తున్నావు! చదివిన చదవుకు ఓ మొగుడు దొరికితే చాలు. ఇంకా చదివిస్తే తర్వాత దివిటీలేసి వెదికినా ఎవడూ దొరకడు" అన్నాడు. వసంత పళ్లెం విడిచి వెళ్లింది. అనంత అయోమయంగా చూసింది. వాసు తల్లి వంక చూశాడు. జానకి నొచ్చుకుంటూ "అయినా భోజనాల దగ్గరే వస్తాయి అన్ని కబుర్లూనూ, ఎప్పుడేది మాట్లాడాలో తెలియకపోతే ఎట్లా చచ్చేది" అని భర్తను విసుక్కుంది. తను లేచి వెళ్ళలేక, పళ్లెం ముందు కూర్చోనూ లేక అవస్థ పడింది.

ఎట్లాగో అయిందనిపించి అందరూ లేచారు కుర్చీల్లోంచి. జానకి గదిలోకి వెళ్ళి "వసంతా కాస్త వేడిగా పాలైనా త్రాగమ్మా" అంటూ లేపింది, బోర్లపడుకున్న వసంత వీపుమీద తడుతూ. వసంత పీడవడంలేదు ముఖమంతా కెంపు వారింది "అత్తయ్యా, నాన్నకు చెప్పండి. నేనుతప్పినా, ప్యాసయినా యింక చదవను నేను కూడా కొన్నాళ్ళు యిక్కడే వుంటా నత్తయ్యా - వీణ నేర్చుకుంటాను" అన్నది జానక్కి ఏమి అర్థంకాలేదు. ఉన్నట్టుండి వీణమీద మనసెందుకయిందో ఆమెకు అర్థం కాలేదు. "ఇంద, ఈ పాలు త్రాగుముందు, అట్లాగే వుండు, వీణ నేర్చుకో, నీ కెట్లా ఇష్టమో అట్లాగే చెయ్యి" అన్నది జానకి అ మరునాటి నుంచి అనంతకు సంగీతం చెప్పే మాష్టారి దగ్గరే వసంత కూడా వీణ నేర్చుకోడం మొదలు పెట్టింది.

అంతలో రిజల్ట్సువచ్చాయి. వాసు రెండుకోర్సుల్లోనూ ప్యాసయ్యాడు. వసంత కూడా ప్యాసయింది. ఆమెకు ఫ్రెంచ్‌లో క్లాసు కూడా వచ్చింది! వాసు మళ్ళీ బెనారస్ వెళ్లిపోయాడు. అనంత కాలేజి కూడా తెరిచారు. అనంత కాలేజికి నాలుగు రోజులు కారులోనూ, నాలుగు రోజులు రిక్షాలోనూ వెళ్ళు ది. "నెలకు నాలుగుసార్లు వర్క్‌షాపు కెళ్తుంది మనకారు. అమ్మేసి క్రొత్తది కొను మామయ్యా" అంది అనంత. "ఇవాళ కారు మార్చమంటావు, రేపు ఇల్లు మారుద్దాం అంటావు. నీకేం తెలుసు" అన్నాడు నారాయణరావు. "ఇల్లు మార్చక్కరలేదు కాని, డాబామీద ఓ గది వేయించండి. వాసు నాలుగేళ్ళబట్టి అడుగుతూంటే వినిపించుకోరు మీరు" అన్నది జానకి.

"చూడు జానకీ, వాడు పైన

గది ఎందుకు కావాలంటున్నాడో నాకు తెలుసు. అందుకే నేను అశ్రద్ధ చేసేది." "అదేమిటి" అన్నది జానకి "వాడికి ఈ వయసులో కోరుకునే స్వేచ్ఛకు ఒక హద్దు వుండదు. ఇంట్లో వుంటే సిగరెట్లు త్రాగడానికి అడ్డు. స్నేహితులతో చీట్లాడ్డానికి, అవకులు, చెవకులు ప్రేలడానికి, చెత్త పుస్తకాలు చదవడానికి అడ్డు. పైన గది వుంటే నెమ్మదిగా స్నేహితులు పోగవుతారు. మనం చూస్తామేమోననే, భయం తగ్గుతుంది. వాళ్ళిష్టం వచ్చినట్లు వుండవచ్చు. ఇంట్లో ఆడపిల్లలు వున్నారు. వాడి స్నేహితులంతూ రోజూ పదిమంది కుర్రాళ్ళు మనింటికి రావడం, పోవడం నాకిష్టంలేదు" అన్నాడు. జానకికి కొడుకు మీద ప్రేమ పొంగిపోయింది. "మన బంగారం మంచిదయితే ఎటువంటి భయమూ అక్కరలేదు వాసు గురించి మీకేమి తెలుసు? వాడు మీకన్నా నియమవంతుడు. వాడు మీలాగా టెంపరెన్సు సొసైటీ మెంబరు కాకపోవచ్చు గాని మీ మీద పంతానికైనా వాడు సిగరెట్లు తాగకుండా వుంటాడు. మీరు మీ నమ్మకాలు, సిద్ధాంతాల గురించి పదిమందికి చెప్పుకుంటారు, వాసు తన గురించి ఎప్పుడూ మాట్లాడడు" అంది ఉద్రేకంగా. నారాయణరావు భార్య పెంచుకున్న మాతృ గర్వాన్ని మొదటిసారి తెలుసుకున్నాడు. భార్య కొడుకును తనతో పోల్చి చెప్పడం ఆయనకు నచ్చలేదు. ఎవరిదారిన వాళ్ళు గదుల్లోకి వెళ్లారు.

ఉన్నట్లుండి ఒకరోజు రాఘవరావు వచ్చాడు. "మళ్ళీ ఏమన్నా చూశారా అన్నయ్యా" అనడిగింది జానకి వసంత సంబంధాల గురించి. "ఆఁ ఒకటో రెండో వచ్చాయి కాని నాకు నచ్చలేదు. అసలు నేనిప్పుడు వచ్చింది ఆ పని మీదనే. నీతో మాట్లాడదామనే వచ్చాను" అన్నాడు. "నాతోనా, అదేమిటన్నయ్యా" అన్నది జానకి. 'మీ మేనల్లుడు కృష్ణమోహన్‌కు మేనరికం చేసుకుంటే సరే, లేకపోతే ఆ సంగతి కదిలించి రావాలి!' అన్నాడు జానకికి ఏమీ తోచలేదు 'ఔను, మా వదినకు అన్న కూతుళ్ళు వున్నారు ముగురు. మద్రాసులో చదువుకుంటున్నారు. పెద్దది ఇందిర మన వసంత క్లాసుమేటు కూడాను, మేనరికం వదులుకుంటా రనుకోను' అన్నది.

"ఈ రోజుల్లో మేనరికాలు అందరూ చేసుకోవడం లేదమ్మాయ్. చేసుకుంటే సరే, లేకపోతే మన మొక మాట వాళ్ళ చెవినేసి వుంటే మంచిది" అన్నాడు రాఘవరావు. జానకి సందేహంగా "ముందు వసంత నడుగుదాం, అదేమో బి. యే. ప్యాసయింది. మోహన్ రెండుసార్లు బి. యే. కు వెళ్ళి తప్పాడు. ఈ మధ్య ఏమైనా ప్యాసయ్యాడేమో తెలియదు.

సినిమాహాలు చూసుకోడం తప్ప చదువు ధ్యాస ఎక్కువలేదు వాడికి. ఇంకా పై చదువులకు వెళ్ళడు' అంది.

'పై చదువు చదవకపోతే నీమీ కొరత కాదులే. కుటుంబం మాకు కలిసింది. తెలిసినవాళ్ళు. కుఱ్ఱవాడు బాగుంటాడు. బుద్ధిమంతుడు. సినిమాహాలు మీద బాగానే గడించారు నా తల్లి సుఖపడుతుంది. డిగ్రీ మీద డిగ్రీలున్నవాళ్ళు ఉద్ధరిస్తారా? వాళ్ళ సంస్కారం చవిచూశాంగా' అన్నాడు రాఘవరావు 'మీ రేమంటారు?' అంది అంతవరకూ మౌనంగా కూర్చున్న భర్తతో. 'మీ యిష్టం, నాదేముంది నమ్మకంవుంటే -ళ్ళి' అన్నాడు నారాయణరావు. జానకిక్కి ఏమి చెయ్యాలో తోచలేదు. వెళ్ళే పని అవుతుందన్న ధైర్యం లేదు. వెళ్ళకుండా ఎట్లా తప్పించుకోవాలో తెలియలేదు. 'అడగలేదన్నమాట నా నెతిన వేసుకోడం దేనికి?' అనుకుని గుంటూరు బయలుదేరింది

ఏదో పనిమీద ఆ గదిలోకి వచ్చిన అనంత తండ్రి మాటలు విని స్తంభించి పోయింది. 'ఏం కావాలి అనంతా' అన్నది జానకి. తేరుకుని 'అబ్బే ఏమీ లేదు' అంటూ తన గదిలోకి వెళ్లి తన పక్కమీద అడ్డంగా పడింది. వసంత 'ఏమిటిట్లా వున్నావు' అని చెల్లెల్ని అడిగింది 'ఏమిటో నొప్పిగా వుంది' అంది అనంత ఏమి తోచక. 'ఏమి నొప్పి' అనడిగింది వసంత కంగారుగా.

'కడుపులో నొప్పిగా వుందక్కా. నువ్వు కొంచెం బైట కెళ్తావా?' అంది అనంత. 'నెల నెలా వస్తుందేమిటి నొప్పి? మందెందుకు తీసుకోవు కొంచెం వేడిగా హార్లిక్స్ తీసుకురానా' అని వసంత బైటకు వెళ్లి గది తలుపు మూసింది. అనంత త్వరగా లేచి తలుపు గడియ పెట్టి వచ్చి మళ్ళీ పక్కమీద పడింది. దిండలో ముఖం పెట్టుకుని బిగ్గరగా ఏడ్చింది.

'ఎందుకిట్లా అవుతున్నది? మోహన్‌ను అక్కను చేసుకోమని అడుగుతారా? నాకు మోహన్ నచ్చాడు. నాకు కావాలి మోహన్. నేను వెళ్ళి చెప్పనా? ఎవరికి? నాన్నతోనా, మామయ్యకోనా? మామయ్య ఏమంటారో, మామయ్యకు మోహన్ అంటే అసలు పడదు. మోహన్ అక్కను చేసుకుంటే అక్కతో కూడా నేను మామూలుగా వుండలేను మోహన్! ఎందుకోయి, నువ్వంత అందంగా వుంటావు? నా మనస్సును ఎందుకు కొల్లగొట్టావు? నీకు నన్ను చూచి ఏమనిపించిందో తెలియదు. నే నెవరితో చెప్పుకోను? మా కాలేజిలో ఎంతమంది అబ్బాయిలు లేరు? ఎంతమంది నాకు ప్రేమ లేఖలు వ్రాయలేదు? ఎప్పుడైనా నా హృదయం స్పందించిందా? నిన్ను చూడగానే నా కెందుకంత ఉన్మత్తత ఆవేశించాలి? ఎందుకంత పరవశించిపోయాను? పదిమందిలో నిన్ను పది నిమిషాలు తనివిదీరా చూడలేక పోయినందుకు ఎంతగా చింతిల్లాను? నీ చెయ్యి

పట్టుకుని ఎవరూ లేని ఏకాంతం లోకి బిరబిరా ఈడ్చుకుపోయి నిలబెట్టి అక్కే, అక్లే చూడాలని పించిందే నాకు — ప్రేమంటే యిది కాదా? నేను నిన్ను ప్రేమించ లేదా? ఏమి పట్టుదల్లు నువ్వు వున్నావు. ఇప్పుడేమో అక్కను యిస్తారట నీకు! భూమి బద్దలై నన్ను యిముడ్చుకుని నా అవ మానం పంచుకోదేం?'

తనుచదివిన నవలల్లోని పాత్రలన్నీ ప్రాణం పోసుకుని ఆమె ఎదుట నిలి చాయి. 'మిమ్మల్ని తెలుసుకునైనా బుద్ధి తెచ్చుకున్నానుకాదు! తెలిసి తెలిసి బురదలోకి దిగాను. నేను కూడా కళ్ళనీళ్ళు నింపుకుని మీ సర సన నిలబడ్డంకంటే చెయ్యగల్గింది ఏముంది?' అనుకుంది. హఠాత్తుగా మోహిని గుర్తుకు వచ్చింది అనం తరు.

"ఇంకొక పిచ్చిది మోహిని. వాసును ప్రేమించింది. ఫలిస్తుందా ఆమె ప్రేమయినా? మోహినిమీద అంతులేని జాలి పొంగింది అనంతకు. "మోహినీ — నువ్వయినా సుఖంగా వుండాలి! నువ్వంటే నాకెంత యిష్టమో తెలుసా నీకు?" అను కుంది. వెంటనే వాసుకు ఉత్తరం వ్రాసింది. "అక్కను మోహన్‌కు అడుగుతారట! నాన్న వచ్చారు. అత్తయ్యను గుంటూరు పంపిస్తున్నారు అడగటానికి. పనిలో పని నీకు మోహినికి కూడా స్థిరం చేస్తారను కుంటాను. నీ కిష్టమేననుకుంటా!" అని వ్రాసింది. ఇంట్లో ఎవరూ అవుద్దేశం ప్రకటించకపోయినా ఓ అబద్ధం జోడించి వ్రాసింది.

ఉత్తరం ముగించి చివర పి. యస్. అనిపెట్టి "నీ రోహిణికి నెలలు నిండాయని రంగన్న అంటున్నాడు" అని వ్రాసింది. రోహిణి వాసు పెంపుడు ఆవు రోహిణి తల్లి లక్ష్మి జానకి పుట్టింటి నించి అరణంగా తెచ్చుకున్న ఆవు. లక్ష్మి పాలు త్రాగే పెరిగాడు వాసు. లక్ష్మికి మొదట నాలుగు దూడలూ కోడెలే! స్వంత వ్యవసాయం లేకపోవడాన అన్ని కోడెలను అమ్మివేశారు. కడమూలి యీత పెయ్యదూడ. ఈన లేక చచ్చిపోయింది లక్ష్మి. ఆ దూడకు ఆవుపాలు కొని పోసి పెంచింది జానకి వాసుకు ఆ దూడంటే ప్రాణం. తనకిచ్చిన బిస్కట్లు, చాక్లెట్లు, అరటిపళ్ళు దానికి సగం పెట్టేవాడు. రోహిణికి మొదటి రెండు కోడెదూడలే. వాటి రెంటిని వాసు అమ్మనివ్వలేదు. నూజెళ్ళ రాఘవరావు యింటికి పంపారు. అక్కడయితే మేత కొనక్కరలేదు. 'రోహిణీ' అని వాసు పిలిస్తే వాసు దగ్గరకు వచ్చి మోపెత్తి గంగడోలు గోకించు కుంటుంది. ఆ రోహిణికి మళ్ళీ ఈనే రోజులు.

(సశేషం)



# క్రకటోవా

చరిత్రకు తెలిసినంతవరకు మానవుడు విన్న పెద్ద శబ్దం ఏదో తెలుసా? 1945 లో హిరోషిమా, నాగసాకి నగరాలమీద యాటంబాంబులు పడినప్పుడు ప్రపంచం ఆ మహా విధ్వంసానికి నిర్ఘాంత పోయింది. ఆ తర్వాత అమెరికా, రష్యాలు వరసగా ఎన్నో యాటంబాంబులను, హైడ్రోజన్ బాంబులను, సూపర్ హైడ్రోజన్ బాంబులను వాటి పాటవాన్ని పరీక్షించడంకోసం ప్రేల్చాయి. ఇప్పుడవి అలవాటైపోయాయి. ప్రపంచం క్రమంగా నిర్ఘాంతపడడం మానేసింది.

ఈ అణ్వస్త్రాల ప్రేలుళ్ళు చాలా శక్తివంతమైనవే. కాని వీటికంటె కొన్ని వందలరెట్లు పెద్ద ప్రేలుడు చరిత్రలో ఒకసారి జరిగింది. అది 1883 అగస్టు 27వ తేదీన క్రకటోవా అగ్నిపర్వతం బద్దలైనప్పుడు జరిగింది.

క్రకటోవా ఇండొనీషియా దీవులలో ఒకటి. జావా, సుమిత్రా ద్వీపాల మధ్య ఉంది. చాలా చిన్న దీవి. దానిలోని అగ్నిపర్వతం బ్రద్దలైనప్పుడు ఆ ధ్వని మూడువేల మైళ్ళ దూరానికి వినిపించింది. ఆ ప్రేలుడు వల్ల సముద్రంలో లేచిన తరంగాలు నాలుగు ఖండాల తీరాలను

**వైజ్ఞానిక చిత్రాలు:** “శేఖర్”

తా కా యి. ఎనిమిదివేల మైళ్ళ దూరం ప్రయాణించాయి. ఆ ప్రేలుడు వల్లపుట్టిన వాయుతరంగం ప్రపంచం చుట్టూ ఒకపారికాదు, చాలాసార్లు ప్రయాణంచేసింది ఆ ద్వీపంలో అర మైలు ఎత్తున పర్వతం వుండవలసిన చోటు వెయ్యి అడుగులలోతు, కొన్ని మైళ్ళు వెడల్పు కలిగిన బ్రహ్మాండమైన రంధ్రం ఏర్పడింది.

ఆ ప్రేలుడువల్ల లేచిన దుమ్ము ఆకాశంలో 30 మైళ్ళ ఎత్తుకు వెళ్ళింది. ఒక ఏడాదిపాటు ఆ దుమ్ము మొత్తం భూగోళాన్ని ఆవరించింది. ఆ అగ్ని పర్వతానికి వందమైళ్ళ దూరంలో ఎక్కడా పెద్ద పట్టణాలేమీ లేకపోయినా, మొత్తం 36 వేల మంది చనిపోయారు.

ఇది మానవ చరిత్రలోకల్లా పెద్ద ప్రేలుడు. దీనిముందు ఎన్ని యాటం బాంబుల ప్రేలుడు చాలుతుంది ?

కుంపటిమీద నీళ్ళు కాచినప్పుడు గిన్నెమీద మూత ఎగిరెగిరి పడుతూ వుంటుంది.

ఆ మూతను కదిలించే శక్తి వంటిదే అగ్ని పర్వతం బ్రద్దలయ్యేట్టు చేస్తుంది. కాకపోతే కొన్ని లక్షల రెట్లు ఎక్కువ శక్తి. అంతే భేదం.

క్రకటోవా అగ్నిపర్వతాన్ని ప్రేల్చినది ఒక మైలు పొడవున వ్యాపించిన లావా శక్తి. అది ఒక ఘనపరిమాణం కలిగిన సముద్రాన్ని విపరీతమైన వేడిగల ఆవిరిగా మార్చి వేసింది.

క్రకటోవా ఒక్కసారిగా ప్రేలలేదు. వార్నింగ్ ఇవ్వకపోలేదు. 1883 మార్చి, ఏప్రిల్ ప్రాంతాల నుంచే పొగ, ఆవిరి రావడం ప్రారంభించాయి. అయితే, ఆ ద్వీపంలో అలా చాలాసార్లు జరిగింది. అందువల్ల ఎవరూ అంతగా పట్టించుకోలేదు. అప్పటికి ఇండొనీసియాను డచ్చివారు పరిపాలిస్తూ వుండేవారు. కెప్టెన్ ఫెర్జినార్ అనే డచ్చివాడు క్రకటోవా వెళ్ళి వచ్చి, అక్కడ రెండు అగ్ని పర్వతాలు "నిద్ర" లేచాయని, బూట్లు తొడుక్కున్నా కాళ్ళు కాలిపోయేంతగా నేల వేడెక్కి పోయిందని బటేవియాలో అధికారులకు చెప్పాడు. ప్రేలుడుకు ముందు క్రకటోవాలో అడుగు పెట్టిన ఆఖరి శ్వేతజాతీయుడు అతడే.

ఆ తర్వాత క్రమంగా క్రకటోవా చుట్టుపక్కల సముద్రం వేడెక్కింది. నౌకలు తిరగడానికికూడా వీలులేకపోయింది. అగ్ని పర్వతం కోపంగా గర్జిస్తున్నట్టు ధ్వనులు జావా తూర్పుతీరాన వినబడేవి. ఆ ధ్వని దూరాన ఎక్కడో తుపాను హోరువలె ఉండేది.

ఆగస్టు 26 వ తేదీ మధ్యాహ్నం నుంచి ఉరుములు ధమ ధమ ఉరుముతున్నట్టు ఉండి వుండి ధ్వనులు మొదలయ్యాయి. క్రమంగా ఆ ధ్వనులు పెద్దవయ్యాయి, మరింత




తరుచు అయ్యాయి. ఆ రాత్రి ఎవరికీ నిద్రపట్టలేదు. తెల్లవారే వేళ అగ్ని పర్వతం ధ్వని తప్ప మరొక శబ్దమే వినబడకుండా పోయింది 26 వ తేదీ సాయంత్రం ఏడు గంటల వేళ పెద్ద ప్రేలుడు జరిగింది. భవనాలు కదిలిపోయాయి. గోడలు బీటలు ఇచ్చాయి. మూసిన తలుపులు వాటంతట అవే తెరుచుకున్నాయి. బటేవియాలో జనం అంతా వీధుల్లోకి పారిపోయారు. ఇంతలో చెవులు చిల్లులు పడేట్టు ఇంకో ప్రేలుడు. ఆ తర్వాత అంతా నిశ్శబ్దం.

కాని, అంతటితో అంతా కాలేదు. అగ్నిపర్వతం పగిలి ఖాళీ ఏర్పడింది. ఆ ఖాళీలో నుంచి లావా ప్రవాహం విపరీత వేగంతో ముందుకు ఉరికింది. రెండో వేపు నుంచి సముద్రం చొచ్చుకువచ్చింది. లావాను తాకగానే, సముద్ర జలం ఆవిరై పైకెగసింది. మళ్ళీ లావా ముందుకుపోయేది. చొచ్చుకువస్తున్న సముద్రాన్ని ఆవిరిచేసేది. ఈ విధంగా లావాకు, సముద్రానికి ఆ రాత్రి అంతా యుద్ధం జరిగింది. చివరకి సముద్రమే గెలిచింది. లావా శక్తి, వేడి ఉడిగి పోయాయి. సముద్రం క్రకటోవా ద్వీప మధ్య భాగాన్ని ఆగస్టు 27 ఉదయమయ్యే సరికి ప్రవేశించింది. ఆ క్రిందటి రోజున వినవచ్చిన రెండు పెద్ద ప్రేలుడులకంటె కొన్నివందల రెట్లు పెద్ద ప్రేలుడు జరిగింది. 14 ఘనపు మైళ్ళ రాళ్ళు ఆకాశంలోకి చిమ్మ

ముద్దాయి. సూర్యుడు కనిపించడం మాని వేశాడు.

అగ్నిధ్వనికి వంద మైళ్ళ దూరంలో వున్న బ్రతుకియా ప్రజల చెవులు తూట్లు పడిపోయాయి. 1700 మైళ్ళు తూర్పుగా వున్న ఆస్ట్రేలియాలో ఫిరంగులు ప్రేలుతున్న చప్పుడైంది. పశ్చిమాన 2968 మైళ్ళ దూరంలో వున్న మెడగాస్కరు వద్ద రోడ్రిగజ్ అనే ద్వీపంలోనివారికి ఆ ధ్వని విని పించింది.

ధ్వని కంటె భయంకరమైనది సముద్రంలో కలిగిన మహా ప్రళయం. వంద అడుగుల ఎత్తున ఉప్పెన లేచింది. నీటితో కట్టిన గోడలా ఆ తరంగం తన కెదురుపడిన ప్రతి దీవాన్ని ముంచివేస్తూ ముందుకు సాగిపోయింది. వేలాది ప్రజలు చనిపోయారు. మొత్తం హిందూ మహా సముద్రమంతా ఆ తరంగం ప్రయాణం చేసింది. 5100 మైళ్ళ దూరంలోవున్న కేప్‌టౌన్ (దక్షిణాఫ్రికా)ను చేరేసరికి ఆ తరంగం ఇంకా ఒక అడుగు ఎత్తున వుంది. అది "గుడ్‌హోప్" అగ్రాన్ని చుట్టి అట్లాంటిక్‌లో ఉత్తరంగాపోయి ఇంగ్లిష్ ఛానల్‌లో అంతమైంది.

ఇండొనీసియాలో ఎన్నో జిల్లాలు భస్మరాశిలో మునిగిపోయాయి. వరి చేలు ఎడారు లయ్యాయి. ఆకాశం బూడిదతో నిండిపోయి బటేవియాలో కొన్నాళ్ళపాటు పగళ్ళు కూడా దీపాలు వెలిగించి వుంచుకోవలసి వచ్చింది.

క్రకటోవా పర్వతం పిండి పిండి అయిపోయి ఆ ధూళి ఆకాశంలో లక్షన్నర అడుగుల ఎత్తుకు చిమ్మింది. ఆ ధూళి అన్ని ఖండాలకు వ్యాపించింది దానిలోనుంచి సూర్యకిరణాలు రావడంవల్ల లండన్‌లో, పారిస్‌లో, న్యూయార్కులో, కయిరోలో అస్తమించే సూర్యుడు నీలంగా, నల్లగా, ఆకుపచ్చగా కనబడేవాడు. రాత్రిళ్ళు చంద్రుడు, నక్షత్రాలు ఆకుపచ్చగా కనిపించేవి.

1884 ఏప్రిల్ వరకు ఈ అద్భుతం ఇలాగే కొనసాగింది. క్రకటోవా పూర్తిగా ధ్వంసమైపోయింది. కాని క్రమంగా మళ్ళీ అక్కడ జీవరాశి — ముందు పచ్చిక, పొదలు, పురుగులు, చీమలు, పక్షులు, జంతువులు సృష్టి పరిణామ క్రమాన్ని గుర్తు చేస్తూ — బయలు దేరింది. ఇప్పుడు ఆ దీవి మామూలుగానే ఉంది. కాని పాత అగ్ని పర్వతం పూర్తిగా మాయమైపోలేదు. దాని స్థానంలో కొత్తది - బాగా చిన్నది - బయలు దేరింది. దాన్ని అక్కడి ప్రజలు "అనక్ క్రకటోవా" అని పిలుస్తారు. అంటే "క్రకటోవా పిల్ల" అని అర్థం. అది కూడా ఎప్పుడో బ్రద్దలవుతుందేమో ఎవరికి తెలుసు?

***




# సినిమాలూ - స్త్రీలూ

**మే** తొమ్మిదవ తేదీ సాయంకాలం మద్రాసులో జరిగిన ఒక సమావేశంలో మద్రాసు ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ వారు 1966లో విడుదలైన దక్షిణ భాషా చిత్రాలకు బహుమతులు ప్రకటించారు. నాటి సమావేశానికి మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ కృష్ణస్వామి రెడ్డి అధ్యక్షత వహించారు.

ఒక్కొక్క భాషకు ఒక్కొక్క కమిటీనివేసి ఉత్తమ చిత్రాలను, ఉత్తమ తారలను ఉత్తమ సాంకేతికజ్ఞులను వోటింగ్ పద్ధతిద్వారా ఎన్నుకొన్నారు.

ప్రతి కమిటీలోను స్త్రీలు వున్నారు. వోటింగ్ సమయంలో స్త్రీల మాటే నెగ్గింది అందుచేత ఎక్కువగా, ముఖ్యంగా తమిళ, మలయాళ భాషా చిత్రాలలో "లేడీస్ సబ్జెక్ట్సు" (స్త్రీల సమస్యలు వున్నవి) ఎక్కువ బహుమతులూ పొందాయి.

తెలుగు కమిటీకి మద్రాసులో సెంట్రల్ బ్యాంకి ఉన్నతాధికారి శ్రీ డి. ఎస్. శాస్త్రి అధ్యక్షులు.

నాటి సమావేశంలో శ్రీ శాస్త్రి, ఇతర కమిటీల అధ్యక్షులు ప్రసంగించినప్పుడు సభ్యురాండ్ర అభిప్రాయాలతో ఒక్కొక్కప్పుడు పేచీలు వచ్చాయని, ఒక్కొక్కప్పుడు వోటింగ్ 5-4, 3-2, 5-5 గా అధ్యక్షుని కాస్టింగ్ వోటుతో నిర్ణయాలు జరుగవలసి వచ్చిందని అన్నారు.

మొత్తానికి సినిమాలపై స్త్రీల ప్రాబల్యమే హెచ్చుగా ఉందన్నారు. కమిటీలలో కూడా స్త్రీలు ఎక్కువమంది ఉంటే మంచిదన్నారు.

తెలుగు రంగంలో "శ్రీ కృష్ణ

పాండవీయం' దర్శకుడు ఎన్. టి. రామారావు ఉత్తమ దర్శకుడుగా నిర్ణయ మైనారు.

'నవరాత్రి' నటుడు అక్కినేని నాగేశ్వరరావు ఉత్తమ నటుడుగా నిర్ణయ మయ్యారు.

ఉత్తమ చిత్రంగా, ఉత్తమ కథగా అన్నపూర్ణా వారి "ఆత్మగౌరవం" నెగ్గింది.

ఉత్తమ నటిగా 'శ్రీకృష్ణతులాభారం' సత్యభామ జమున, క్యారక్టర్ యాక్ట్రెస్ అనే కొత్త తరగతిలో సావిత్రి, తెలుగు తమిళ రంగాలు రెండింటిలోను ఉత్తమ నేపథ్య గాయనిగా పి. సుశీల ఎన్నిక అయ్యారు.



నందన ఫిలింస్ "సాక్షి" ఔట్ డోర్ దృశ్యం....

కె. వి. మహాదేవన్ తెలుగు (ఆస్తిపరులు), తమిళ (మహాకవి కాళిదాసు) రంగాలు రెండింటిలోను ఉత్తమ సంగీత దర్శకుడుగా నిర్ణయం కావడం, "లేత మనసులు" పద్మిని ఉత్తమ బాల నటిగా ఎన్నిక కావడం తదితర విశేషాలు.

## "ప్రాణమిత్రులు"

ప్రక్కదోవలు లేకుండా కథ సూటిగా వెళ్ళిన చిత్రం పద్మశ్రీ వారి "ప్రాణమిత్రులు."

ఒక అంశం – ఆయువుపట్టు వంటిది – తీసుకొని దాని చుట్టూ కథ నడచిన ఈ చిత్రం వి. వెంకటేశ్వర్లు, పి. పుల్లయ్య, ముళ్ళపూడి వెంకటరమణ సృష్టి.

సందర్భమో అసందర్భమో వినోదం ఉండితీరాలి; సీరియస్ సీనును కామెడీ సీను వెంబడించాలి; సెక్స్, రొమాన్స్, డ్యాన్సులు కామాలు, కోలనులు, సెమికోలన్లు వలె సినిమా వాక్యంలో రావాలి అనే పాత సూత్రాలకు పాతర వేసిన ఈ చిత్రం కళ, ఛాయాగ్రహణం, సంభాషణలు, అభినయములలో ఉన్నత ప్రమాణాలు సాధించిన శ్రీ ఫిలింస్ రిలీజ్.

ప్రాణమిత్రుల కథా కాలం భారత దేశం అస్వతంత్రంగా వున్న నాటిది.

దేహాలు వేరైనా, ప్రాణం ఒక్కటే ఐనా బాబు, చిన్నాలగాథ



నందనా ఫిలింస్ "సాక్షి" చిత్రంలో

విజయనిర్మల, కృష్ణ

ఇది; వారిలో ఒకరు కన్నవారు, మరొకరు కన్ను వంటివారు అయిన జగదాంబ గాథ ఇది.

నౌకా వ్యాపారం చేసే విశాఖపట్నం కుటుంబంలో దాదాపు జమీందారిణి వంటిది జగదాంబ (శాంతకుమారి). ఆమె కుమారుడు బాబు-(జగ్గయ్య). వారింటి నౌకరు చిన్న (నాగేశ్వరరావు).

బాబు, చిన్న ఒకతల్లి కడుపున పుట్టకపోయినా ఒక తల్లి పాలు తాగి పెరిగారు. అన్నదమ్ములు ఎరగని అన్యోన్యత వారిది.

వినోద విలాసాలలోను వారు జంటగా వున్నారు నౌకా కంపెనీ కార్మికులకు (రేలంగి, గిరిజ, చదలవాడ అండ్ కంపెనీ) రాత్రి బడులు నడుపుతున్న పార్వతితో (సావిత్రి) నేస్తానికి బాబు తన నేస్తాన్ని (నాగేశ్వరరావు) ప్రయోగించాడు. ఫలితం చిన్నాపై పార్వతి హస్త ప్రయోగం.

జగదాంబ సంపదలకు దివాను (గుమ్మడి) బాబు విలాస పురుషుడని తెలుసుకొని, కంపెనీ వ్యవహారాలలో గుడ్డి సంతకాలు చెయ్యడం

తప్పితే వేరే ఆసక్తిలేదని తెలుసుకొని, ఏమరుపాటుతో కొన్ని సంతకాలు చేయించుకొని బాబు పట్టి ముంచాలనే ఎట్టి ప్లానులో వుంటాడు.

అయితే దేవుడు వరమిచ్చినా పూజారి వర మివ్వడనే సామెతలా బాబు సంతకాల వరాలు యివ్వబోతూవుంటే చిన్నా అన్నిచోట్లా అడ్డు తగులుతాడు. ఈ పీడ మ వదగడ చేసుకోడానికి దివాను తన సహాయకునితో (అల్లు రామలింగయ్య) దురాలోచనలు, దూరాలోచనలు సాగిస్తాడు. జగదాంబలో ద్వేషంరగిల్చి, చిన్నాను ఇంటినుంచి గెంటివేయడానికి ప్రయత్నిస్తాడు. కాని చిట్టచివరి క్షణంలో కథ అడ్డం తిరుగుతుంది

చదువురాని చిన్నా క్రింద దివాను పని చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. ఈ నిశాని దారునే పట్టి కొట్టించాలనే సంకల్పంలోకొంపలు ముంచే డాక్యుమెంట్లు తెచ్చి చిన్నా ముందు పెట్టతాడు. చిన్న ఆ పత్రాలపై నామాలు పెడతాడు. అంతవరకు పగలు ఆఫీసులో వుంటూ రాత్రి పార్వతివద్ద ఓనమాలు ప్రారంభించి, ఇంగ్లీషు కూడా చదివి అబద్ధపు పత్రాలకే నామాలు పెట్టే స్థితికి వచ్చాడన్నమాట.

చిన్నాకు రాత్రివేళల ఓనమాలు నేర్పిన పార్వతి స్త్రీ కదా. తను చిన్నాతో ప్రేమలో ఓనమాలు కూడా ప్రారంభించింది. అది బాబు చూచాడు. తన మూలాన పార్వతి చెంప దెబ్బ తిన్న చిన్నా ఈ నాడు పార్వతికే ప్రేమ చెంప దెబ్బ వెయ్యడం ఒక విజయంగా యెంచాడు.

బాబుకు ఎందుకో వేళాకోళంగా చిన్నా స్నేహాన్ని పరీక్షించాలనిపించింది. పార్వతిపై కాంక్షను సూచనగా ప్రకటించి వెనుదిరిగి చూశాడు. అప్పటికే చిన్నా పార్వతికి తన మిత్రుని వాంఛ తెలపడం, మునుపటివలె చెంపపై కాక గుండెపై గుదిబండ దెబ్బ తినడం జరిగింది.

బాబు పశ్చాత్తాప పడ్డాడు. తన స్వేచ్ఛమైన మనసు నిరూపించడం కోసం పద్మను (కాంచన) వివాహమాడాడు. తను ఒక యింటి వాడయ్యాడు. కాని చిన్నాను ఒక యింటివాణ్ణి చెయ్యలేక పోయాడు.

పరిస్థితుల ప్రాబల్యం వల్లనేమి, దివాను మాయోపాయం వల్లనేమి బాబు చిన్నాను ఒక కార్మిక నాయక ఇంటివాణ్ణి చేశాడు.

కార్మిక నాయకుడుగా చిన్నా, అహం పెరిగిన బాబును అణచి వెయ్యవలసిన ప్రళయ పరిస్థితి వచ్చింది. బాబు పిస్తల్ తీశాడు. ఒకటి, .. రెండు పది అనేలోగా చిన్నా బాబూ మనిషి, మనసు తెలిసిన మనిషి కావాలి. బాబూ తొమ్మిదీ అన్నాడు. ఇంకా రాలే

దేరా అన్నాడు. పిస్టల్ ప్రేి
పార్వతిచే గుండెకు గుదిబండ ై
తిన్న చిన్న గుండెకు ఇప్పుడువి
గుండు తగిలింది. ప్రాణమిర
రక్తంరాల్చి ప్రేమ, కరుణ
బాబులో ఎగజిమ్మింప జేశాడు.

ప్రాణమిత్రుల మధ్య, తల్లి వారికీ మధ్య సంఘటనలను, దుర్ఘటనలను హృద్యంగా హృదయం ద్రవింపజేసేటట్లుగా చిత్రీకరించారు.

అంతా ఏదో ఒక క్రొత్తకథ, వాతావరణం, కథనం చూస్తున్నామని పిస్తుంది ఆద్యంతం నాగేశ్వరరావు, జగ్గయ్య పోటాపోటీగా నటించి తెలుగు నటనలో మరొక వెలుగు చూపారు.

ప్రాణమిత్రుల మధ్య రవ్వ రగల డానికి కారణం, రవ్వ ఒడబాగ్నిగా ప్రజ్వరిల్లడానికి స్వాభావికమైన కారణాలు చూపిస్తే ఈ చిత్రం మరింత రమ్యంగా వుండేది.

మొత్తానికి అనేక క్రొత్త కోణాలు చూపిన పద్మశ్రీ వారికి ఆ మూడు అక్షరాలు తగును.

* * *

## నటి జయంతి హిందీ చిత్రాలు

ప్రమోద్‌చక్రవర్తి కలర్ చిత్రం, కేదార్ కపూర్ తెలుపు నలుపు చిత్రంలోనూ నటిస్తున్న తెలుగుతార జయంతిని సత్యేన్‌బోస్ తన హిందీ చిత్రానికి మే రెండవ వారంలో బుక్ చేసు కొన్నారు.

"గల్లభామ -
ఎన్. టి. రామారావు

# చలన చిత్ర వార్తలు

## ఆదుర్తిపై మంచు వర్షం

కన్నెపిల' హిందీ చిత్రం ఔట్ డోర్ షూటింగ్ లో పాల్గొని దర్శకుడు ఆదర్తి సుబ్బారావు డార్జిలింగ్ నుంచి మే ఒకటవ తేదీన మద్రాసుకు తిరిగివచ్చారు డార్జిలింగ్ అనుభవాలపై ఈ లేఖకునితో ఆదుర్తి ముచ్చటిస్తూ ఏప్రిల్‌లో కూడా అచ్చట మంచు వృష్టి విపరీతంగా వుందన్నారు.

దాదాపు 30 రోజుల ఔట్‌డోర్

గాసనాల సత్ఫలితాలను చెప్ప
ుతున్నా నన్నారు.

ేదకాలం నుంచీ యోగవిద్య
ఖలో వుందని, మరెన్ని శతా
కైనా దాని విలువ వుండనే
ుం దన్నారు.

కైలాస పర్వతం ఎత్తిన రావ
ణాసురుడు నుంచి సినీనటుడు
రామారావు వరకు యోగవిద్య
సత్ఫలితాలు పొందినవారే నన్నారు.

ఊటీలో కాల్‌షీటు

నాలుగు గంటలు

అన్నపూర్ణావారు "పూలరంగడు"
ఔట్‌డోర్ షూటింగ్ ఉదకమండ
లంలో పది పన్నెండు రోజులు జరిపి
మే మధ్యలో మద్రాసు వచ్చారు.

హైదరాబాద్‌నుంచి ఉదకమండ
లానికి తెలుగు యూనిట్ ఒక క్యార
వాన్‌గా వెళ్ళింది. ఈ యూనిట్‌కు
మధ్య మజిలీ మద్రాసు.

మద్రాసు నుంచి కోయంబత్తూర్
మీదుగా ఉదకమండలానికి ప్రయా
ణాలు రకరకాలుగా సాగాయి.

కెమెరా సామగ్రి తీసుకు వెళ
వలసిన వారు రైలులో, విరామం
ఉన్నవారు రైలులో, ముందుగా
వెళ్ళి అజమాయిషీ చెయ్యవలసిన
వారు విమానంలో, చివరి క్యాబీలో
ఒకరోజు ఎకంలో అదుర్తి, నాగేశ్వర
రావు, జమున తదితరులు వెళ్ళారు.

ిసి
న్

ధ్యా
మె పై
న్ని ఘట్టాలు డార్జి
ంగ్‌లో చిత్రీకరించారు.

సినిమా తారలకు

రామారావు చిట్కాలు

సినిమా రంగంలోనేమి, మరే
రంగంలోనేమి ఎవరైనా దార్ఢ్యంతో
ఉత్సాహంతో చిరకాలం నవనవ
లాడుతూ వుండాలంటే యోగ విద్య
క్రమ పద్ధతిని అభ్యసించడం మంచి
దని ఎన్. టి. రామారావు సలహా
యిచ్చారు.

మే ఏడవ తేదీని మద్రాసు త్యాగ
రాయనగర్‌లో వాల్తేరు యోగవిద్యా
చార్యుడు సచ్చిదానందస్వామి
యోగవిద్యా ప్రదర్శనలకు అధ్యక్షత
వహించిన సందర్భంలో రామారావు
మాట్లాడుతూ స్వానుభవంతో



"గొల్లభామ"లో రామారావు విజయలక్ష్మి

ఏప్రిల్ 29వ తేదీనుంచే మద్రాసునుంచి ప్రయాణాలు ప్రారంభమయ్యాయి

డార్జిలింగ్ నుంచి వచ్చిన అదుర్తి మే రెండవ తేదీ మధ్యాహ్నం బయలుదేరి వెళ్ళారు

మే మూడవ తేదీన ఊటీకి బయలుదేరి వెళ్ళేముందు అక్కినేని నాగేశ్వరరావు ఈ లేఖకునితో ముచ్చటిస్తూ ఊటీలో తన కార్యక్రమం గురించి ముచ్చటించారు

ఊటీలో రోజుకు నాలుగు గంటలు మించి షూటింగ్‌కు వీలుండదన్నారు సూర్యునితో దోబూచులాడు కోనవలసి ఉటుందన్నారు

'అయితే మిగిలిన కాలం ఏం జేస్తారు?' అని అడగ్గా ఆలోచించ వలసింది చాలా ఉందన్నారు

'మీ హైదరాబాద్ ఇండస్ట్రీస్ గురించా' అని అడగ్గా కాదన్నారు

సినిమా విషయాలే చాలా ఆలోచించ వలసినవి వున్నా యన్నారు.

నాగేశ్వరరావు కొత్తగా పి ఏ పి వారి 'బ్రహ్మచారి'లో నటించేందుకు అంగీకరించారు

ఏ వి ఎమ్ వారి కలర్ చిత్రంలోను, తెలుపు నలుపు చిత్రంలోను నటించేందుకు అంగీకరించారు

పోగా పోగా కొత్త స్వంత షణ్ముఖ చక్రవర్తి చిత్ర వుంది. ఆదుర్తి దర్శకత్వం, భాగస్వామ్యం.

ఉదకమండలం నుంచి వచ్చే టప్పుడు నాగేశ్వరరావు ... ఖ్య నిర్ణయంతో రావచ్చు నంటున్నారు. ఆస్ట్రేలియా వెళ్ళే సంకల్పం లోనూ ఉన్నారు "అంతస్తులు" ఆస్ట్రేలియాలో ఫిలిం ఉత్సవంలో ప్రదర్శించ బడుతోంది. నాగేశ్వర రావు, నిర్మాత రాజేంద్రప్రసాద్



రేఖా అండ్ మురళి ప్రొడక్షన్స్ వారి "శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న"లో పద్మనాభం

ఈ సంచిక వెలవడేసరికి ఆస్ట్రేలియాలో వుండచ్చు.

"పూలరంగడు" ఊటీ షెడ్యూలులో నాగేశ్వరరావు, జమునల పై, శోభన్‌బాబు విజయనిర్మల పైన పాటలు చిత్రీకరించారు.

పోతే శ్రీ సారథి స్టూడియోస్‌లో ఒక్క చిన్న షూటింగ్ షెడ్యూలు మాత్రం మిగిలివుంది.

జూన్‌లో అదికూడా పూర్తి అయిపోతుంది.

వేరొక చెంప ఫైనల్ ఎడిటింగ్ కూడా జరుగుతున్నది.

నిర్మాత దుక్కిపాటి మధుసూదన రావు.

ఈ చిత్రానికి ముప్పాళ రంగనాయకమ్మ సంభాషణలు రచించారు. సంగీతం రాజేశ్వరరావు.

## రంగారావు భాగాలే తరువాయి

బి.ఆర్. ఫిలిమ్స్ వారి మ్యూజికల్ మిస్టరీకి మే రెండవ వారంలో మద్రాసు శివారు కొన్నత్తూర్‌లో కొంత చిత్రీకరణ జరిగింది. రాజశ్రీ, రామమోహన్ పాల్గొన్నారు. రంగారావు భాగాలు మాత్రమే కెమెరా దర్శనం చేసుకోవలసివుంది. రంగారావు, రాజశ్రీ కూడా ద్విపాత్రాభినయం చేస్తున్న ఈ చిత్రం ప్రసాద్‌ను సినీ రచయితగా



"శ్రీ కృష్ణమహిమ" చిత్రంలో ఒక నృత్యావేశం

శ్రీనివాసరావును డైరక్టర్ గా, ఎస్. రామలింగేశ్వరరావును (తండ్రి రాజేశ్వరరావుతోపాటు) సంగీత దర్శకునిగా పరిచయం చేస్తున్నది. నిర్మాత బ్రహ్మానందం రామారావు. నిర్వహణ "చిత్ర" నరసింహారావు.

## వెండి తెరకు

## కండల వీరుడు అర్జా

"మిస్టర్ హెర్క్యులస్" (కలకత్తా), "మిస్టర్ మద్రాస్ స్టేట్", మిస్టర్ ఇండియా" మొదలైన కండల వీర బిరుదులు పొందిన ఏకైక ఆంధ్రుడు అర్జా జనార్దనరావు తారకరామా పిక్చర్స్‌వారి "శ్రీకృష్ణావతారం"లో [illegible] నటిస్తున్నారు. కాంతకుమారి హజరైనారు. "భారత్ శ్రీ" వేషభాష [illegible] ములపై సంతృప్తి ప్రకటించారు. పుండరీకాక్షయ్య చిత్రానికి కమలాకర కామేశ్వరరావు దర్శకుడు. రచన: సముద్రాల రామానుజాచార్య.

*

ఎస్. వి. ఎస్ వారి "నిండు మనసులు" ఒక గజదొంగకు సంబంధించిన కథ దర్శకుడు ఎస్. డి. లాల్. రామారావు, దేవిక ప్రధాన పాత్రధారులు.

## జయంతీవారి

## సన్యాసి వేషాలు

జయంతీవారి హాస్య వ్యంగ్య జానపదంలో మరొక షెడ్యూలు మే రెండవ వారంలో జరిగింది సన్యాసి రాజు (రాజనాల) 'దర్బారు' ధోరణులు చిత్రీకరించారు కె. వి. రెడ్డి దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రానికి మాటలు, పాటలు పింగళి నాగేంద్రరావు సమకూర్చారు

* * *

"పెళ్ళిరోజు" చిత్రంలో ఒక పాట పాడేందుకు జమున తీవ్రంగా ఆలోచిస్తున్నారు



"గొల్లభామ"లో
దేవిక

## ప్రసాద్ చిత్రానికి

## ప్రత్యగాత్మ దర్శకత్వం

ప్రసాద్ ప్రొడక్షన్స్‌వారి హిందీ చిత్రానికి ప్రత్యగాత్మ దర్శకత్వం వహించ బోతున్నారు హిందీ "కుల గోత్రాలు" ఇప్పటికి 8 రీళ్ళు అయింది నాల్గింట మూడు వంతులు పూర్తి కాగానే ప్రసాద్ చిత్రం పని ప్రారంభిస్తార

## పింజల చిత్రానికి

## సూర్యం దర్శకత్వం

"హంతకులొస్తున్నారు జాగ్రత్త" నిర్మాత పింజలి సుబ్బారావు అతి త్వరలో తీయబోయే జానపద చిత్రానికి గిడుతూరి సూర్యం దర్శకత్వం వహిస్తారని, కాంతారావు, రామకృష్ణ మొదలైనవారు ముఖ్య భూమికలు ధరించగలరని తెలుస్తున్నది.

## నాగభూషణం చిత్రానికి

## సూర్యం దర్శకత్వం

స్టేజి, సినీనటుడు నాగభూషణం తెలుగులో నిర్మించనున్న "కలికాలం"కు గిడుతూరి సూర్యం దర్శకత్వం నెరవుతారని, ఛమిడిపాటి రాధాకృష్ణ సంభాషణలు వ్రాస్తున్నారని తెలుస్తున్నది



"శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న"లో గీతాంజలి, పద్మనాభం

## "అందం కోసం పందెం"

కాంచన, భారతి, పద్మజ, సాధన, కాంతారావు, రమణారెడ్డి, రాజనాల, చలం, రాజబాబు, మిక్కిలినేని, వరప్రసాద్ మున్నగు తారాగణంతో హృషికేశ్ పిక్చర్స్ పతాకం క్రింద నిర్మింపబడుతోంది "అందం కోసం పందెం" అనే జానపద చిత్రం. ఈ చిత్రంలో బి. రామలింగయ్య చౌదరి అనే ఒక నటుడు ఒక ముఖ్య భూమికను ధరిస్తున్నాడు. నిర్మాత శ్రీ వై. వి. కృష్ణమూర్తిగారే యీ చిత్రానికి కథను అల్లారు, సంభాషణలు శ్రీ వీటూరి లిఖించారు. స్క్రిన్ ప్లే, దర్శకత్వం శ్రీ అమంచర్ల శేషగిరిరావు నిర్వహిస్తున్నారు. సంగీతాన్ని శ్రీ కోదండపాణి అందిస్తున్నారు. వాహినీ, విజయా స్టుడియోలలో చిత్రీకరింప బడుతోన్న ఈ చిత్రాన్ని అతిత్వరలోనే పూర్తి చేసి ఆంధ్ర ప్రజానీకానికి అందివ్వాలనే నిర్మాత శ్రీ వై. వి. కృష్ణయ్యగారి సంకల్పం. పాత తారలతో పాటూ కొత్త తారలను కూడా యీ చిత్రంలో ప్రవేశపెట్టాలనే యీ చిత్ర నిర్మాత అభిప్రాయం. ఇప్పటికి ఈ చిత్రం మూడు సెట్లలో వర్కు పూర్తి అయింది. మళ్ళీ జూన్ నెల మొదటి వారంలో మరో సెట్ మీద పని ప్రారంభం కానున్నది.

